# విజ్ఞప్తి.

విద్వద్వరిష్ఠులారా!

కథ పురాణప్రసిద్ధము కాని పురాణగాథకు నిందలియితివృత్తమునకు భేద మున్నది. రూపకలక్షణముల ననుసరించుటకు, కావ్యవృత్తి (Poetic truth) నుద్ధరించుటకు, పాత్రపోషణమునకు, ననుకూలముగ గల్పించుటకై కొన్నిమార్పులు చేయఁబడినవి. కాళిదాసునభిజ్ఞానశాకుంతలములోని శిల్పము లక్ష్యముగను, ప్రతాపరుద్రీయము లక్షణగ్రంథముగను గైకొని నాయోపినంతవఱకును రచించితిని. కాని కవిత యొకరిసొమ్ము కాదుగదా? వారివారి "కవిత్వమహత్త్వపటుత్వసంపద"లు వారివారివే కాన సుహృదయు లగుకళావేత్తలు దోసఁగులను రచయితకుఁ దెల్పి, పునర్ముద్రణమున సవరించుకొనుట కవకాశము నొసంగియు, గుణము లున్నవానిని గ్రహించియు, నుత్తమనాటకరచనకు గ్రంథకర్తనుఁ బురికొల్పుదురు కాక యని ప్రార్థించువాఁడను.

నాల్గేండ్లనుండియును, ముఖ్యముగా నాయధైర్యముచేత సముద్రితముగా నున్నయీరూపకంబును ప్రకాశింపఁజేయ ప్రోత్సాహము నొసంగిన పోషకుల కెంతయును కృతజ్ఞుఁడను.

ఈగ్రంథమును సావకాశముగ బరికించి, వ్యాకరణదోషములను దిద్ది, రసోల్లసనమున కవశ్యకంబు లగు సవరణల గావించి, నా పురోభివృద్ధికై పాటుపడి సరస్వతీపవర్ ప్రెస్సునందు కార్యనిర్వాహకులుగ నున్న శ్రీయుత సత్యవోలు అప్పారావుగారికి కృతజ్ఞతా జ ం సమస్కారశతంబు లర్పించి, గుణనిర్ణయాధికారము చదువరుల కొప్పగించు,

ఆత్మకూరు.
ఆగష్టు 1924

విద్వద్విధేయుఁడు
కల్లూరు వేంకటనారాయణరావు

## పాత్రలు.

పురుషులు.

బ్రహ్మ—సత్యలోకచక్రవర్తి.

గౌతముడు—మహర్షి, అహల్యాప్రియుడు.

ఇంద్రుడు—స్వర్గ (అమరావతి) వల్లభుడు, కథానాయకుడు.

మాతలి—ఇంద్రునిసారథి—స్నేహితుడు.

సురభానుడు—ఇంద్రుని రెండవసారథి.

సంచారుడు—స్వర్గలోకవార్తావహుడు

శ్రీరాముడు—అయోధ్యాపురప్రభువైన రాజు.

లక్ష్మణుడు—రాముని తమ్ముడు.

ద్వారపాలుడు, ఋషులు మొదలగువారు.

స్త్రీలు.

వాణి—బ్రహ్మరాణి.

అహల్య—కథానాయిక, బ్రహ్మకూతురు, గౌతముని భార్య.

కలభాషి నర్మద—అహల్యకు చెలికత్తెలు.

సీత—రాముని భార్య.

ముత్తైదువులు మొదలగువారు.

పోషకస్తుతి.

సీ. శ్రీమించి బ్రోవఁగ చెలఁగునసంతాఖ్య
మండలంబున దయామహితుఁ డితఁడె
విహితశ్రద్ధాచార్యవితతి సేవించుచు
వినుతశీలము గల్గువిదురుఁ డితఁడె
“అరకేరి” వంశమహానందనోద్యాన
మునఁ గల్పభూజమై మొనరు నితఁడె
“కరిబసప్ప”ను ధన్యుఁ డరుదార ముదమున
పుత్రుఁడై బొల్చినపుణ్యుఁ డితఁడె
గీ. యనుచు కేల్జూపఁగా నెవ్వఁ డగును లక్ష్య
మట్టిఁడైన బసప్పకు ననవరతము
ఆయురారోగ్యసంపత్సుఖాదిశుభము
లిచ్చు దేవదేవుండు మహేశ్వరుండు.
సీ. “అరికేరి” నామపూతాన్వయదుగ్ధాబ్ధిఁ
జందురుఁడై యెవ్వఁడు సంజనించె
గుణముముఖ్యంబను గురుసుభాషితసుప
ద్ధతి కెప్పు డెవ్వఁ డాదర్శ మయ్యె
అమలుఁడై మనుతండ్రి “అయ్యప్ప నేత్రచ
క్రముల కెవ్వాఁ డర్కకరణి వెలయు
నాంగ్లేండునుండియు నవనవలాడక
నొదిగినకృతి నెవం డుద్ధరించె
నట్టిదానధర్మాసక్తిశ్లాఘ్యునకును
వినుతునకును కరిబసప్ప కనవరతము
ఆయురారోగ్యసంపత్సుఖాదిశుభము
లిచ్చి రక్షించు శ్రీరాముఁ డిష్టదుండు.

శ్రీ ర స్తు.

# శ్రీ అహల్యాసహస్రాక్షము.

## నాంది.

శా. నిర్విఘ్నంబుగఁ బొల్చుఁ గావుత, మదాంధీభూతరక్షశ్ఛటా
గర్వాహార్యశతారుఁ డంచితత్రిలోకస్తుత్యవృత్తుం, డిలా
గీర్వాణావనదక్షుఁ డిద్ధమునిసూక్తిజ్ఞాతిగూపుండు, దా
సర్వాసన్నత్వము లిచ్చి బ్రోవ నిది యశ్రాంతం బనల్పంబుగన్

(సూత్రధారి ప్రవేశము.)

సూ—సభ్యు లెల్లరు నుత్కంఠతో నాటకోపక్రమణమున కై వేచి యున్నారు. ప్రకటనాప్రకారము విళంబ మింకను నొక్కగడియ యున్నది. (ఒకవంక మొగం బయి) ప్రేయసీ!

(నేపథ్యమునుండి) వచ్చితిని.

సూ—లోలాక్షు లతిచపలస్వభావలు. కావుననే యింత ప్రొద్దయినను రత్నాభరణభరణము జాలింప వైతివి.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! వందనము. నన్ను నామంత్రించి నందులకు గతం బేమి?

సూ—రూపకారంభమునకుఁ బూర్వము సదస్యులెంతసే పని విసుగు నొందకుండునట్లు ని న్నొకటిగీతము పాడు మని వేఁడుటకు

నటి—గీతమున కేమిలెండు! నేఁడు మన మభినయింపఁ బోవునాటకమున గీతములు లేవా.

సూ—ఉండవచ్చును కాని యవి యన్నియుఁ గథాక్రమోపయోగప్రయోగములుగా నుండును. భావైకప్రదర్శనములుగా నుండవు.

నటి—అట్లయిన మీయభిప్రాయము నాటకములు గంభీరభావపూరితము లగుగీతములతో నిండి యుండ వలయు ననియా? లేక

యిట్లు వాక్కొనుటలు గ్రంథకర్తయొక్క గీతరచనా ప్రియత్వము ను సూచించుటకా? తేటపఱుపుఁడు.

సూ—ప్రియా లేనివన్నియు నూహించు చుంటివి. పాపము! ఇది యంతయు మొన్న మొన్న నేను నేర్పినవిద్యాప్రభావమో! గీత రచనయందు గడునిష్టము కలవాఁడయ్యు నీరచయిత మన మూఁడ బోవురూపకమును ముఖ్యముగా పాత్రప్రవర్తనౌచిత్యనిరూపక మున కై రచించెను.

నటి—ఈకవి వ్రాసిన యితరనాటకము లేవి యైన నున్నవా?

సూ—"శ్రీకృష్ణార్జునీయము" "అవిధేయతనయ చరిత్రము" అనునవి.

నటి—అవి నేను పఠించి యున్నాను. అవి బాగుగ లే వని చెప్పజా లను, కాని—

సూ—ఆంగ్లేయభాషావిమర్శనపద్ధతి ననుసరించితివి. ప్రథమ కావ్య ముపై తీవ్రవిమర్శనము తగదు.

నటి—తగ దనిన గద్యమున కవి యని వ్రాసికొనిన దెందులకు?

సూ—ప్రాసనియమముకొఱకు అతండు నాకు నెయ్యుండు కావున నా తనిడెంద మేనెఱుంగుదును. అతం డిరువదివత్సరములు దాటని వాఁడయినను గర్హణీయుఁడు కాఁడు. ఏలయంటివేని,

సీ. అష్టమహాయునమంద నారాయణ
భక్తాగ్రగణ్యు నాసక్తిఁ గాంచె
శైశవంబున దోడిసఖులు దేశికులును
బాగడంగ సురుచిరాధ్వగతిఁ గాంచె
విజ్ఞానచంద్రికావిబుధమండలిచేత
నూటపదార్ల నొక్కట గాంచె
పదితొమ్మిదవ వర్షంబు లోదవిననాటనే
వచనప్రబంధంబు వ్రాయ గాంచె

గీ. సత్యనారాయణమహాత్మ్యసరణి గాంచె
విపులభాషాసతీపదాబ్జములు గాంచె
సుకవినికురుంబమును భక్తిఁ జూడఁ గాంచె
యిద్ధ మగుకృష్ణకథ రచియింపఁ గాంచె

నటి—(పులకవవ్వుతో) ఇంత గాంచినవాఁడు కావుననే కృతి వ్రాసెను.

సూ—ప్రియా! తెలిసియు నిందించు చుంటివి. అతఁడు,

సీ. నాటకావలినీటు నాటగ విరచింపఁ
దిరుపతీశకవుల సరయు లేదు.
పాఠకలోకహృత్పద్మము వికసింపఁ
బ్రఖ్యాతకవికావ్యపఠన లేదు.
తే. టమాటలఁగీర్తిఁ జాటింప లక్ష్మణన్ప
సింహాకవీంద్రులఁ జేరలేదు.
సరసప్రబంధరచన మొనర్పంగ సా
హితియందు ప్రజ్ఞాధికతయు లేదు.
బాలుఁడిఁక బరిశ్రమయును జాల లేదు
ఆంధ్రవిద్వత్కదంబము లాదరించి
నెఱసులను ద్రోసి యనుకంప నెఱపుననెడు
నమ్మకమ్మున రచియించినాఁడు సుదతి?

నటి—మీరు నుడివినయట్లు వినయము సౌశీల్యము కవికి కలదేని, ఆ మియింతును. కాని ప్రస్తుతకథానామ మేమి? అద్భుతగాత్ర మమా?

సూ—కాదు. కాదు. అహల్యాసహస్రాక్షము.

నటి—కథ యించుక నీతివంతము కాదేమో యని సందేహము.

సూ— ఈయితివృత్తము కవికృతపాత్రగుణనిరూపణ సంవిధానకౌ

శలముచేత, చాలమట్టునకు నీతిప్రీధర్మ బయి యున్నది.

నటి—ఆలస్య మైనది. గ్రంథకర్తవిషయము జాలింతము. నేటి రేయి మన మేటు లీమహాజనులఁ దోషితస్వాంతులనుఁగా జేయుదుమో యని తహతహపడుచున్నాను.

సూత్ర—కాంతా! సుగుణరత్నరత్నాకరు లగు ప్రేక్షకమహాశయులు క్షీరనీరంబుల విభజించి గ్రోలురాయంచలువోలె, సకళంకమైన శరత్పూర్ణిమాసుధాకరునిబింబము నందు సుధాపూరము నాను చాతకంబులభాతి, సంతోషిల్లుదురు గాని దూషణాభిముఖులు గాఁ జాలరు. ఐనను, సదస్యుల్లను, రూపకరచనాదక్షులను, మమ్ముఁ గవినిఁ బ్రోవఁ బ్రార్థించువాఁడను.

సీ. ఆంధ్రనాటకవాఙ్మయ సుధాబ్ధికెవ్వాఁడు
రాకాహిమాంశునిరహి వహించు
నవరసాలంకారనవ్యభూషణరాజి
గాన్క నొసఁగె దెల్గుకల్కి కెవఁడు
భావగర్భితరసబంధురపద్యహారం
సకముల నిడె సరస్వతికి నెవఁడు
సలలితమాధురీకలితోక్తి నిచయముల్
నెఱసూఱ లిచ్చిరి తేఱుచు నెవరు
అట్టికృష్ణమాచార్యుని, యాంధ్రవామ
లూరుసుతు శ్రీనివాసార్య, చారుకీర్తి
నమ్మల నారసింహాఖ్యులఁ బండితులను,
గొల్చెదను వారిసరణిన బొల్చునట్లు.

నటి—ఎవరివో యాలకింపు మాపలుకుల.

(నేపథ్యమున)—"ఓహో! సత్యలోకరామణీయకము నేమని వర్ణించువాఁడను.

సూ——(చెవియొగ్గి) పురందరుఁ డజభువనంబున కరిగియుండెను. ఇఁక బోదము లెమ్ము.

నటి——పరభృతకుహూకుహూస్వనభాసమానుఁ
డమలసుమబాణుఁ డల్లల నరుగుదెంచె
మలయమారుతపోతము ల్మలయు చూడ
సర్వవిరహుల నేఁచువసంతుతోడ.

(నిష్క్రమింతురు.)



శ్రీరస్తు.

# శ్రీ అహల్యాసహస్రాక్షము.

## ప్రథమాంకము.

[స్థలము: సత్యలోకము, ఉద్యానవనము యథోక్తముగా నిందుృఁడు ప్రవేశించును.]

ఓహో! సత్యలోకరామణీయకము నేమని వర్ణించువాఁడను.

సీ॥ అన్యోన్యవైషమ్య మొంది గుందెడు మృగం
బులసందడి జనించు కలఁత లేక
అతిరభసాశుగాహతము లై రొద నొద
వించుమార్గికులనడి వెడల నీక
పథికశ్రమాపహాప్రీణ్య మగుప్రకృ
తివిలాసలోప మింతేని రాక
విషయవాంఛలఁ దేలువెఱ్ఱిబుద్ధులయసం
బద్ధోక్తుల విరసప్రదము గాక
నిష్కళంకమైత్రిని ప్రాణినిచయ మొసఁగ
నిరుపమానప్రశాంతంబు నెఱయుచుండ
ప్రకృతిలావణ్యసముధీప్రభ చెలంగ
నజునిలోకంబు వంద్య మై యొరిదిగొలరు

ఊ! సౌందర్యమున కేమి? సర్వవిశిష్టసృష్టయు, కాన మై యుండ, నే నింతయచ్చెరు వందుట సరిగాదు. కాని బ్రహ్మ నాకు దర్శన మీఁ గలఁడో? లేఁడో? ఎవరక్కడ! ద్వారపాలకుఁడు నిద్రించుచుండెనా?

ద్వార:—మహాశయా! లేదు లేదు. సత్యలోకవాసులు నిరంతర సమాధినిష్ఠాగరిష్ఠులుసుమ్ము! ఏమిమువల? (తనలో) ఈతఁ డేల యరుదెంచి యుండెడిని? రాక్షసుఁ డెవఁ డైన తనపక్షణంబు పై దాడి వెడలెనో? ఎప్పుడును రాజసంబుతో మత్తెక్కి కొలఁద గానక మెలంగునీతనికి శిక్ష విధించులాగున, విధి యెవనినేని రక్కసు నొక్కనిఁ సృజించుచునే యుండును; వానివిక్రమమునకు సహింపక, తనచేతగాక నీతఁడు గడియగడియకు నాయజమానుని శరణంబుఁ జొచ్చు "చేతగానమ్మకు చేష్టలుమెండు" ఒకటే పోరు. ఎడతెగనిగోడు.

ఇంద్రు:-శ్రీచతుర్ముఖచరణసన్నిధికినేవచ్చియుంటినని విన్నవింపుము.

ద్వార:—అయ్యా! తల్లిగారితోఁ గూడి వా రవరోధమున రహస్యకేళిని వర్తించు చున్నవారు. కొన్ని నిముసములు తాళి రండు.

ఇంద్రు:—(స్వ) కొన్ని నిముసములు? నాకు నైదాఱు గంటలు. దేవమానమునకన్న సత్యలోకకాలమాన మతిదీర్ఘము. (ప్ర) సరియె. (కొంతదవ్వు వెనుదిరిగి) అల్ల! సత్యభువనరుచిరోద్యానము (చెవియొగ్గి) ఓహో! పిక విరావముల ధిక్కరించుకలకంఠములు సుశ్రావ్యము లయ్యె. ఇవి పరభృతబుత్రములు కావుగదా? కొందఱు మధురాలాపలు, వనవిహారసముత్సుకలై భాషించు చున్నట్లున్నది. అం దొక్కస్వనంబుమాత్ర మతిగ మతికి నింపు నింపు చుండె. మజ్ఝారే!

గీ. మావికెంజిగుళ్ళను మెక్కి మఱుఁగుపికము
లెంతయును నెండవానల నంతతంబు
లలితమధుమాసవాసరముల తపసుల
భంగి నభ్యాసమును జేసి పడయవయ్యె
మాన్యతర మైనకలకంఠిమధురరవము.

నిష్కుటముఁ జొత్తు గాక (ముందు వోయి) అచ్చోటు ముచ్చట మఱియు దివ్యవిగ్రహం బేమి? (ఆశ్చర్య మభినయించి) ఇది యేమి వింత! భూలోకమునకుఁ బైనఁగదా సత్యజగం బుంట! రోదసిని మించు, మించు, యెంత యోదవ్వుల నున్న సత్యావని కేలకచ్చు. నిరాహారులు నిత్యయానసులు. నిరంజనులు నగుని చటివారు పాన సభిలషింపరు. కాని, యిదేమి? అకస్మాత్ప్రయోదాపేతకుణద్యుతులిట దృశ్యము లగుటకుఁ గతం బేమి? చిత్తము జెదరినది. తన్వంగులు, తటిల్లతాసదృశలు. మున్న యువతీగానమును చవి గొంటిని. వారే వీరు గారా? ఏమో చప్పుడు—

మందారుడు—(ప్రవేశించి) ప్రభూ! వారే వీ రెట్లగుదురు. వీరు ఋషులు. వారు రాక్షసులు (స్వ) ఇటకు వచ్చినను రావణుని భీతి దెగలేదే?

ఇంద్రు:—మఱచితిని. భగవానుఁ డింకను దర్శనఁ మిచ్చునరి కాలస్య మగును. నీవు వెనుదిరిగి, సురలోకవార్త లరయుచుండుము.

మందా:—చిత్తము (పోవుచు వనమువంక జూచి,) అహా! దర్శనమగుటకు మున్న, మఱల, మై మఱపునకు నిదర్శనముగాకుండు ఁకు.

ఇంద్రు:—(నవ్వుచు) చాలును. పో, [మందారుఁడు నిష్క్రమము] ఔరా!

చ. అతులరుచిన్ జగంబున జనావలి విభ్రమ మంద చంచలా
ప్రతతి యొసంగు, దానికి విరావము ఘోరము మానవుల్భయాం
బతిగను బొందు వారనుచు నబ్జజుఁ డీవిధి సృష్టిచేసెనో
సతులశరీరరీతి విలసన్మధురస్వనము జెలంగఁగన్ !

(వనవిహారలాలస లగు అహల్యయు సఖులునుఁ బ్రవేశింపఁగా నింద్రుఁడు మఱుగున మాటునడుగు)

అహ:—కలభాషిణీ! నీహంసకధ్వనుల నాలించుచు రాయంచలు భవదాగమమునకు వేచి యున్నవి.

కల—సఖి! భవదాగమమునకు

నర్మద:—ప్రియాగమనమునకు ఎవరైన నేమి?

ఇంద్రు:—(స్వ) రాజహంసము తత్ప్రియాగమనమునకు, వేచి యున్నది. ఈకురంగమును జొచ్చి వీరిసుధాపూరము లగుసల్లాపముల నాలకించెదను. వీనులవిందుగ నీరమణీమతల్లి పలుకు దేని యులం జూటం గొందుం గాక!

అహ—ఈసహకార కుమారుం డీలవలీలతాలలన పై నెట్టనం బైకొను చున్నవాడో వీక్షింపుము.

కల:—ఔనౌను, మగవారు మోహావేశమున మందాతమును బొత్తిగ వీడుదురు.

నర్మ—అనయము ననయముగా పురుషనింద సేయు చుందువు. చూడుము. లవలీవల్లియు భరవినమ్ర యై సహకరణమభిలషించిన నీహకారుం డన్వర్థనామధేయుఁడు గాన నంగనాశ్రమనివారణచణుం డై ప్రాపుగా నిల్చి యున్నవాడు.

అహ—సఖి! నీవ్యాఖ్యాన మద్భుతముగా నున్నది.

కల—చాలశ్రవణసుఖముగా నున్నది.

ఇంద్రు—(జనాంతికము) కడుంగడు నర్మదంబుగ నున్నది.

నర్మ—ఏమి వెక్కిరింపులు! ఏమివయగారములు.

అహ—క్షేమము నిన్ను బహూకరింపంగా ముఖస్తుతి యని నిరాకరించితివి. పరికింపుము! మల్లిక మనోజ్ఞముగా వికచస్మేరముఖము చే గారవించు చూడియున్నం బ్రొద్దుతిరుగు పువ్వు నిర్లక్ష్య మభినయించు చున్నది.

కల—నర్మదా! తెలిసినదా. సుందరదన యగు నీమెయె మల్లిక.

తక్కినది నీవూహింపఁ గలవు.

నర్మ—ఊహ కేమిగాని మారుతుఁ డెట్లు మల్లిక నూచుచుండెనో తిలకింపుము. కొమ్మలను పున్నాగములు కదలించుట నైసర్గికం బుగదా! అహల్యా! ఏలనిశ్చలదృష్టితో నావైపుననే యాలకించుచుంటివి.

అహ—ఏమియులేదు. ఈసరోజము శుద్ధతరమై కొదమతుమ్మెదల స్పర్శ లేకుండ నున్నది.

నర్మ—నీవలెనేసుమా! అం దచుంబితమకరందము వెలయుచున్నది. రాజకీరనాసాచూచుకశకలీకృతమై, నిష్యందరసబిందుసందోహముకలదై యాదొండపం డెట్లు మెఱయు చున్నదో గనుము.

ఇంద్రు—కంటిని. ఆరమణీమనోహరోష్ఠము, తత్ఫలసాదృశ్యంబు నొందు చున్నది. ఆయధరామృతము నింకను గ్రోలఁ గల్గినమహామహుండు జనింప లేదా? ఆరూపు లోకమున కగోచరంబు.

నర్మ—సఖీ! ఆపారిజాతసుమ మెంతపరిమళించుచు సొబగుఁ జూపుచున్నదో! కంటే!

అహ—ఇదె వెడలి గ్రహించెదను. (ముందుబోయి) ఇదేమి! పారిజాతలతాజాలమున నాపైట దగుల్కొన్నది. దీనిని బిరాన చిక్కుడలింపుము.

కల—బిరాననేల? నీసౌందర్యముకట్టి తెగి యొలుకునో? నీరూపు యెవరికేని గోచర మగునో?

ఇంద్రు—నిశ్చయముగా వెల్లివిరియుచున్నది (లేచి) అరికట్టుదును గాక. (ఆగి) మానసమా తొందరపడకుము. ఇఁకఁ గొంతనా మూర్తిలావణ్యము నభినందించి యానందింపుము.

నర్మ—ఇదె పైఁట సవరించితిని. చక్రములు భవద్వక్షసీమ నాలోకించి పరిభ్రమించుచున్నవి.

కల—ఆమె "దోర్మూలసరసి నోలలాడుఘనతర స్తనచక్రవాకము లఁ గాంచి"

అహ—మనలోమనము బరిహాసము లొనర్చికొంట యసమంజసము.

కల—ఔను. ప్రియులు ప్రియల నీక్షించి పరిహసించుట సముచితంబు.

నర్మ—మనయహల్య కెప్పు డట్టిభాగ్యము లభించును?

కల—అపుడు మనలఁ బల్కరింపదు. మన మొంటికత్తెలము.

నర్మ—అహల్యాపరిచారికలుగ నరుగఁ గలము లెమ్ము..

కల—మాసమున కెన్ని వరహాల వేతనము?

నర్మ—ఆమెప్రేమయే వేతనము. పురందరాదు లామెసేవకై నిరంతరసప్రియత్నధురీణులై యుండ మన కేమిలగ్గు.

అహ—పురందరుండేమి? లేని వన్నియు ప్రేలుచుంటిరి.

ఇంద్రు—ఇయ్యదే. సరోజవల్లికను గ్రహింప దివ్యురుభద్రవారణరాజువోలె నీకరగ్రహణమున కై యభిలషించుచు నిందుఁడు వేచియున్నవాఁడు.

కల—స్వర్గసౌఖ్య మేమిసౌఖ్యము? బ్రహ్మకల్పములు గడచిపోయినను జలింపక దపోనిష్ఠులై యుపచీయమానులగు మహర్షుల భాగ్యమే భాగ్యము.

నర్మ—ప్రకృతిపురుషసంయోగంబున నాత్మానుసంధానముఁ గావించుచు, భగవత్స్వరూపు లగుతపోధనులు నిరంతరవికసితసుమమరందఝురీగృహీతభ్రమరవారఝుంకారసంకులము లగువనంబులఁ గదా వసింతురు. వారికి స్వర్ణకుట్టిమములు, రత్నమయమందిరములు లేవు గదా.

అహ—నిర్మలంబై ఆద్యంతశూన్యంబై చెలువారునంబరంబు క్షణమాత్రద్యోత మగువిద్యుత్ప్రవాహంబుచేఁ బ్రపూరితము గాకు

న్న నేమి? లక్ష్మి, తరంగసదృశ. జీవితము విద్యుచ్చంచలము.

కల—సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులసాహచర్య మునఁజేసి యెంత వేదాంత మభ్యసించితివమ్మ! ఇంద్రప్రాభవ మును, సంయములతపస్సంపదలకన్న తక్కువగఁ జేసివైచితివి.

నర్మ—సరస్వతి తల్లిగను, సకలభువననిర్మాత యగుధాత తండ్రిగ ను వెలయునీయువతీమతల్లి ప్రకృతిసౌందర్యలోలుపత సూచించు టచ్చెరువు గాదు.

ఇంద్రు—ఏమి. సంభాషణ మిట్లైనది.—కాని—నేనును తపస్వి. నాపుణ్యబలంబునఁ గాదె సురసామ్రాజ్యము లభించినది.

గీ. అమలరుచిలసన్నందనోద్యాన సీమ
ఈమనోహరసుకుమారి యెలమి నడువ
పల్లవస్నిగ్ధతత్పదస్పర్శచేత
పావనము కాఁ గలదు నన్నుఁ బతిగఁ గొన్న.

అహ—నేఁ డేలకో గాని యతిథు లెవరును రారైరి. వృథా యేల యిటఁ దామసింప వలయును.

కల—అతిథుల కేమి? నీవు, వాంఛించినశచీపతియే యిటకు రాఁ గలండు.

ఇంద్రు—ఇదియె యదను (ప్రకాశముగా) ఇప్పుడే వచ్చుచుంటిని.

అహ—అతిథిమహాశయులకు స్వాగతము.

కల:—(స్వ) కాఁగలకార్యము గంధర్వులే కూర్చి రన్నట్లు వీ రిరువురి సమాగమంబు విధిచోదితంబువోలె లభించినది.

నర్మ:—దేవేంద్రా! కూర్చుండుము (సంభ్రమముతో జనాంతికముగా) వినన ట్లుండె మోహపరవశుం డగునున్మత్తునిక్రియ నితం డు ప్రణయచేష్టాప్రదర్శకుఁ డై యుండె.

ఇంద్రు:—కాంతామణీ నీమందహాసచంద్రికలే యస్మదీయమాన

సచాతకమ్ములకు సుస్వాగత మొసంగు చుండెను.

శర్మ:—ఇతఁడు తొందరపడుచుండెను.

కల:—మహాత్మా! ఈముగ్ధ మీవాక్యసత్కృతి నభినందించుశక్తి లేనిది. అల్లదే! కుటీరంబునఁ గొంతవిశ్రమింతురు రండు.

శర్మ:—శచీసుందరస్మితములఁ జొక్కి యుండుమీకు మునికన్యల స్మేరాననము లేమిసుఖం బొదవించు. దాక్షిణ్యవశంబున నట్లు వల్కితిరిగాక!

అహ:—(స్వ) దక్షిణనాయకులకడ నే నుండ నొల్లను (ప్ర) ప్రయాణాయాసమ్ముచే నొచ్చినమీయంగకమ్ముల నీసలిలధారఁ దోఁగుటవలన మాన్పికొండు.

ఇంద్రు:—సుదతీ! నీవాక్సుధాసేచనంబుననే నాబడలిక యంతయుఁ దీరినది.

(నేపథ్యమున! "అహల్యా")

శర్మ:—అమ్మా. వాణి నిన్నేలకో బిల్చుచున్నది పోయిరమ్ము.

అహ:—(స్వ) తప్పెను. ఈయతి వేలస్తుతి వినజాలను. సమయము నకు సరిగ మాతల్లియుఁ బిలుచు చుండె. (పోవును)

ఇంద్రు:—ఆహా! చంద్రిక యదృశ్య మైనది. విషమాంధకారమెల్లెడలఁ గ్రమ్మె! దురదృష్టమా చేతి కందినదానిని నోటి కబ్బనీయవుగదా.

శర్మ:—ఆర్యా! ఏమిదీర్ఘముగ నాలోచించుచుంటిరి. ఇంద్రుప్రస్తరవేదిపైఁ గూర్చుండుఁడు.

ఇంద్రు:—అటులనే (తెరపడును)



శ్రీ

# అహల్యాసహ్రస్రాక్షము.

## —ద్వితీయాంకము.—

[స్థలము: సత్యలోకము, బ్రహ్మమందిరము.]

అహ:—అమ్మా! ఏల నన్ను బిల్చితివి (ప్రవేశించును.)

వాణి—(ఎదుర్కొని, కౌఁగిలించి) బిడ్డా! అతిథు లెవరును రాలే దుగదా. ఇంతతడవేల తామసించితివి.

బ్రహ్మ:—(వెంటనే పోడసూపి) నర్మద యెవరితోడనో ప్రసంగము చేయుచున్నది.

అహ:—శచీనాథుఁడరుదెంచి యున్నవాఁడు. అతఁడు, మనశ్చాంచల్యముఁ గన బలుచెడి.

వాణి:—నీభువనైక మోహనోద్ధత సౌకుమార్య మేరిని గలఁత పెట్ట కుండును?

అహ:—(తలవంచి) అమ్మా! నన్ను బిల్వఁబంచినకతం బేమి?

వాణి:—కుమారీ! యుక్తవయోవతి వగునీవు శీఘ్రకాలముననే వివాహితవు కా నుంటివి. భుజంగగంధర్వకిన్నరవిద్యాధర దేవమానవులలో నెవరు నీయుల్లముస కింపు సంపాదింపఁ గలరో, వారికే యిందిరాలలామను క్షీరమధనసమయమున హరికివోలె గూర్ప నుంటిని.

అహ:—సకలజనరహస్యవేది, ధాత్రురసనాస్తరణరంగత్తరుణపాదపల్లవ వగునీకుఁ దెలియనిదియుఁ గలదే? ఇంత వేగముగ వివాహితనై యుండ నా కిష్టము లేదు.

వాణి:—బాలా! మందాతుమందాతురంబు లగునీ సూక్తులు ద్వ్యర్థము లై యున్నవి. నీకిష్టము లేదు. నాకు దెలియును.

(గౌతముఁడు ప్రవేశించును)

అహ:—తల్లీ ఏమి దెలియును?

గౌత:—ఏమిదెలియదు? తల్లీ! వందనములు.

వాణి:—మహర్షులకు దెలియని దే మున్నది. గౌతమా! స్వాగతము. అర్ఘ్యపాద్యాదుల స్వీకరింపుము.

గౌత:—మాతా! స్వీకరించినట్లే. నీసందర్శనంబున మార్గాయాసపరిశ్రాంతి యైనది.

అహ:—తరుణవయస్కుఁ డగునిమ్మహాతపస్విగుణశీలములు నీవఱకే మదీయకర్ణావతంసకుసుమంబు లై యున్నవి. అంగనాజనమనోద్దీపకం బగునీతనిలావణ్యము దుస్సహం బగునీతని తేజంబునకు వన్నె వెట్టెడిని.

గౌత:—(స్వ) అస్మచ్చక్షుశ్చాతకంబులకు దృష్టి గాసుధావృష్టిఁ గురియించు నీసుందరి యెవ రై యుండును.

వాణి:—హ్రీకలితంబు లగువీరిపరస్పరావలోకనములు ప్రణయక్షీరవార్ధి భంగములవోలె జూపట్టెడు.

గౌత:—(స్వ) ఇదేమి ఈకెలన నుపస్థితుం డగునలువకు నమస్కరింపక బాలికాతనుసౌకుమార్యపంజరబద్ధ మై నామనోవిహగ మూరకున్నది (ప్రకాశముగ) చతుర్దశభువననిర్మాణదక్షుఁ డగువిరించికి పుత్రసముఁ డగుగౌతముఁ డిదియ నమితుఁ డగుచున్న వాఁడు,

బ్రహ్మ:—కుమారా! కల్యాణప్రాప్తిరస్తు

వాణి:—విధివాక్యములు అనుల్లంఘనీయములు అమోఘములు.

గౌత:—మాతా కృతార్థుఁడను.

అహ:—(స్వ) నిన్ను వీక్షించినదాన నాజన్మము కృతార్థతఁ బొరసె.

బ్రహ్మ:—గౌతమా! రావణునిదుండగము లెట్లున్నవి?

గౌత:—మహాత్మా—మీకుఁ దెలియని దొండు లేదు అయినను నాయజ్ఞానజన్యవ్యాహారసంచయంబును శైశవదశానంజాతావ్య క్తాలాపము లనుకతంబున నాదరించి వినఁగోరితివి. రావణుని వి క్రమవిహారమునకు మీరు వరము లొసంగిన దాదిగా నెడలేదు. లోకసౌఖ్యసంధాతకులుగ నహోరాత్రనిర్మాతలుగ నీచే నియమితులగుసూర్యచంద్రులపై కతండు దాడి వెడలెను. మరుత్తను రాజఋషిని వేధింపఁబోయెను! కుబేరునిపుష్పకవిమాన మాతని వశమైయుండ నిచ్ఛావిహార మొకలెక్కయా? యమవరుణవాయువ్యాది దిగధీశులయు క్కడంచెద నని యదంభసుంభత్సమరసంరంభమున మురిసిపోవుచు పంక్తికంధరుఁ డెల్లపుడు నిరంకుశుఁడై వర్తించు చుండు.

బ్రహ్మ:—ఇఁక నెన్ని దినములు?

గౌత:—భవత్కృపాకటాక్షప్రసార మాతనిపై నుండువఱకు

బ్రహ్మ:—ఎవరికృప యేమి చేయఁ గలదు? దుష్కర్మ కుదయ మించినంత నయ్యదియే తత్కర్తకుఁ జేటు నాపాదింపఁ గలదు? శుభాశుభముల నేదియైనను కర్మ మవశ్య మనుభోక్తవ్యము.

గౌత:—తండ్రీ ఇంకొకవిశేషము భార్యాసమర్పణమునకైనఁ గమలాక్షుఁ దర్పితుఁజేయఁ దివిరినరఘుమహాచక్రవర్తివంశంబున జనించియధికదర్పదండితారాతివితానుం డగుదశరధమహీశుండు, పుత్రకామేష్టి యొనర్చు చుండెను. అయ్యాగంబున కనంతసంఖ్యాకులుగ భూనాయకు లరుగు చుండిరి. భగవంతుఁ డవతరించునని వినికిడి గలదు. ఇపుడు జన్మించి యుండిన—

బ్రహ్మ:—ఔను అదియట్లుండె

(దౌవారికుఁడరుదెంచి) దేవా! జయము జయము!

బ్రహ్మ—కథయెంతవఱకు సాగినది?

దౌవారికుఁడు:—ప్రభూ! దశశిరుం డుక్కుమిగిలి యవనీనాథులను దిక్పాలురను నిర్జించు జతనంబులు సేయు చున్నవాఁడు. వరుణ తనయులు యుక్తిచేత రాక్షసుని యలజడిఁ దప్పించుకొనిరి. య ముండు హోరాహోరిగ ఘోరసంగ్రామముఁ జేయు చుండెను. ఇఁకగొంతసేపునకుఁ గాలపాశము రావణుని సంక్రమించిదుంచి వేయఁగలదు. ఇట్లు—

బ్రహ్మ:—(ఆత్రముతో) ఆగు మాగుము. నావాక్యము పొల్లగుకాల ము వచ్చు చుండె. తత్క్షణము పోయి సాంపరాయంబు ముగిం పునకు గొనివత్తును (నిష్క్రమించును)

గౌత:—మాతా! భక్తవాత్సల్యము విధాతకుఁ గష్టముల నాపాదిం చు చున్నది. కానిశుభప్రదముగాదు. వితరణశీలము దురారా ధ్యము

వాణి:—ఇది యంతయు లీల; మిథ్యావిహారము శ్రావణమాసమునం దలిమేఘములు రాత్రిందివములు, వర్షముఁ గురియుచు మరలస లిలము సముద్రగత మైనవెనుక దానిని భాస్కరునివలన గ్రహిం చు పగిది భగవంతుఁడు తనమహిమనే సృష్టిస్థితిలయంబులను ని యమములకు లోబరచి మరలఁ జేర్చికొనువాఁడు. నేను నానాథుఁ డు యీసమస్తజగంబునాతని లీలాబుద్బుదసంచాలనంబు. ఏమి యీనిరుపమానం బగుపరిపంచకేళీవైచిత్ర్యము? విష్ణునామము స్వయంభూసమాఖ్య, మహేశ్వరబిరుదము నీకే తగును. జగత్పతీ! సర్వశక్తి! విజయీభవ!

గౌతముఁడు:—తల్లీ! లోపల వెలుపల నావరించి యాభగవల్లీల కం తయును జైతన్య మొసంగునీసరస్వతీత్వ మేమి సామాన్యమా?

వాణి:—(దరస్మితముగ్రు) అంతయు నతని యాజ్ఞ. అహల్యా! మాటల సందడిని మఱచియే పోయితిని. నిలిచి యున్న యీయాయావనము ని కుమారున కొకసముచితాసనంబుఁ గల్పింపుము.

అహ:—అట్లనే— (పరిక్రమించును)

గౌత:—అంబా! ఈరూపమహనీయ యెవ తె? నిర్మలాకాశంబులో నిమెఱుంగు తెఱుంగున నతిశాంతరసప్రజ్వలితం బగునీలోకంబున నమానుష తేజోవిభవుల రగు మీసాన్నిధ్యమున మెలంగు నీత న్వంగి యెవ తె?

వాణి:—ఈమెమైమెఱవు, నీకనులను మిఱుమిట్లు గొలుపలేదుగ దా. ఎన్నియోసార్లింతకు మున్ను వీక్షించియుండియు పృచ్ఛింప సిగ్గుబడుచుంటివా?

గౌత:—ఉన్నట్టులుండి యనావృతమేఘుం బగునంబరంబున విద్యుల్లత మెఱసె త్తిన నేపాంధుండు తలయె త్తి యవలోకింప కుండు ను? ఇంతకుము న్నాలోకించినను భ్రాంతి యింతకు సాహసింపజే య లేదు.

వాణి:—ఎవడవలోకించి భ్రాంతచిత్తుండు గా కుండును.

గౌత:—ఉద్విగ్న మనస్కుఁడ నగునాకామెనాను మెఱింగింపుము.

వాణి:—ఈచిన్నది అహల్య నా బడు నాకుమారిక

గౌత:—ఈయుత్కృష్టరత్నంబు నాకు లభింప గలదేని దయతోడ నానతిమ్ము

వాణి:—ప్రణయరసరత్నాకరంబున మునుఁగ నిది మణి యెట్లు పొం దుపడును.

గౌత:—ప్రేమవీచికాగర్భమున నప్పుడే మునిఁగి యుంటిని. తుచ్ఛవి షయలౌల్యమునకు గాదు గదా ధర్మ పత్నీత్వము.

వాణి:—కుమారా నీయింగితం బె నెఱింగితిని. నే నే మని నిర్ణయిం తును అస్మదీశుఁడరు దేనిమ్ము

గౌత:—భ్రమరఝంకారమున గాని కమలమ్ము మరంద మిాయ నియ్యకొనదు. ప్రియాలాపసమాకర్ణనమునఁ గాని కాంతలు మెత్త పడరు. అహల్యచిత్తమెత్తెఱంగున నున్నదో

వాణి:—ఇంతవట్టునకు నమ్ముము. మానససరసి నోలలాడు రాజహంసి, రాయంచ చెలిమియే వాంఛించును గాని నవశ్రీమృణాళకలాభిరామంబుకదా యని రాజనిష్కుటకేళీతటాకవిహారచణంబగు బాతునుఁగామింప నేరదు. నైర్మల్యము లేనియెడ రత్నకుట్టిమ హాటకభిత్తికాసముదంచితంబు లగుహర్మ్యరాజములను దిరస్కరించి శాంతరసము లెల్ల విరిసినది కుటీరంబ మైనను గారవించు స్వభావంబు గలదహల్య.

గౌత:—అదియ వేనవేలు. నాయాశాలత నీయీమధురవ్యవహారామృతసేచనమున నేకెత్తినది. తల్లీ యిఁక విరించి చనుదెంచుసూచనములు లేవు. మధ్యాహ్నకాలం బగుచున్నది. సంధ్యాసమయవిహితకృత్యంబు లాచరింపఁ దడ వయ్యెడు. గాన నే జనువాఁడ. సెలవిమ్ము.

అహ:—(ప్రవేశించి) ఇదే రత్నపీఠము!

వాణి:—తనయా? అతిథి మరలునప్పుడా నీవు రత్నాసనం బని పచరించుట!

అహ:—(స్వ) ఇంతశీఘ్రమున మరలు నని నా కేమి దెలియును (ప్ర) అతిథిమహాశయుఁ డింతత్వరగ మరలుటకుఁ గారణము?

వాణి:—విధ్యుక్తకర్మవు, గౌతమా పోయి రమ్ము.

గౌత:—(స్వ) నీయపాంగ దృష్టుల నెదుర్కొని యరుగువాఁడను.

(నిష్క్రమించును.)

అహ:—(స్వ) నాపార్థనావిలోకనములు నిన్నాప జాలినవి గావు. నానయనచాతకములు తనివిదీర కున్నవి.

వాణి:—వానకోయిల వర్షబిందువులనే గ్రోలును.

అహ:—అధికతపస్తేజోవంతుఁ డగునీసంయమియే?

వాణి:—ఈసవయస్కుఁడెవ్వరందువా?

అహ:—సవయస్కుఁ డని కాదు బ్రహ్మవర్చస్సముపేత మగునతని ముఖమండలము న న్నాతనినామధేయము దెలిసికొన బ్రేరేపించుచున్నది.

వాణి:—నీలావణ్యజ్యోత్స్న యాతనిమనస్సముద్రము నుద్రేకింపఁజేసి నీనామ మెఱుంగ నతని బ్రేరేపించెను.

అహ:—(సంతోషిత యై లజ్జతో) అమ్మా! అతనివిషయ మై బ్రశ్నించుట లేదు గాని.

వాణి:—కాని నేను చెప్పెదను. అతఁడు గౌతముఁడనుమునికుమారుడు. వేదాధ్యయనతత్పరుఁడై యింతవఱకు నతండు బ్రహ్మచర్యాశ్రమంబునిష్ఠమై నడపినసంయమధనుండు. సకలకలాకుశలుండు. సర్వశాస్త్రప్రవీణుండు. నీరు నించునెడ భుక్ భుక్ ధ్వానకరణంబైనకుంభము జలప్రపూర్ణమైనయనంతరము చప్పుడు దక్కుమాడ్కి సంపూర్ణవిద్యావంతుఁ డయి యిక్కుమారుండతిశాంతయుక్తుఁడై ద్వితీయాశ్రమము బ్రవేశింప నున్నవాఁడు.

అహ:—అతనిసాహచర్యముఁ గల్గి వెలయుగృహిణి నిశ్చిత మైయున్నదా?

వాణి:—కాకేమి? అనూనశ్రద్ధాపతిభక్తిపరాయణ యగు సుందరీమణి యెవ్వతెయైనసరియే.

అహ:—అట్టిమహామునిపాదముల నిరంతరము సేవింప గలభాగ్యవతి యెవ్వతె గలదో.

వాణి:—(మందహాసముతో) వాంఛించిన నీవు భాగ్యవతివి కావా?

అహ:—తల్లీ! నీకృపావిశేషము.

వాణి:—మొదటనుండియు నిన్నతండు నీవతనిని ప్రేమించి యుంట నేనెఱుంగని సంగతి గాదు.

అహ:—అమ్మా! అదియెట్లు.

వాణి:—బిడ్డా? ప్రేమసముద్రము పొంగి తుంగతరంగములతో పై కెగయునప్పుడు చంద్రుఁడు పూర్ణమండలుం డై యంబరంబున బొలిచినప్పుడు తత్సంవిధానము చూడఁ గలవాఁరు చూతురు. నీప్రేమ నేల గప్పివై చెదవు.

అహ:—చూచినంతమాత్రమున, ఒకరివిషయమున హితైషిణి నైనంతమాత్రమున, ప్రేమ యుదయించినదని చెప్పఁ దగునా.

బ్రహ్మ:—(ప్రవేశించి) తన్వీ! చూచితివా? దుష్టబుద్ధి యగురావణుని వలన నెంతతొందర గల్గినది. యమునికాలపాశమా లేక నావరబలమా యేది విజయము నంద గలదు.

వాణి—రెండును.

బ్రహ్మ—అట్లనే యైనది. శ్రీరాముఁడు ప్రవర్ధమానుఁ డగుచున్న వాఁడు. బుద్ధి లేక సర్వంసహాచక్రవర్తి నని తెలిసికొని గర్వించి లంకాధిపతి దుండగముల నొనర్చువాఁడు. ఇంత యమునివలన పరాభవంబు నంది రావణుండు కపటోపాయధురీణుం డై యమాదుల తదితరదిక్పతులలోడ సమరములు చాలించి యింద్రుపై నమరావతి కరుగువాఁడు. ఇఁక మహేంద్రుఁడేమని విన్నపముఁ బుత్తెంచునో! తేలుకు పెత్తన మిచ్చిన రేయెల్ల కుట్టినట్లు దుష్టులకు సైతము వివేకము లేక భక్తిప్రీతుఁ డైనయెడ నమోఘము లగువరము లొసంగి యీవిధముగా పిమ్మట మిడుకులాడ వలసి యున్నాఁడను.

వాణి—కాలార్జితము! జగత్కర్మఫలము! దీనికి మీరు కారకులుకారు; మీరు తటస్థమాత్రులై సర్వంకషప్రజ్ఞ గలిగినభగవానుని ప్రపంచలీలాజాలమును వీక్షించి నాదే యని భ్రమించి వృథా

వ్యాకులచిత్తు లై యుంటిరి.

బ్రహ్మ—సతీ నిక్కువము. నీసమాధానవచనంబు లుపనిషత్సారములు ఇఁక లెమ్ము. కొంతతడ వాదిదేవారాధన తత్పరత మై, యూసికతామయ ప్రదేశమున వసింతము. కాని, అహల్యా! ఎవ రేని యతిథులు వచ్చి రేని సత్కరింపుము.

(నిష్క్రమింతురు)



శ్రీ

# అహల్యాసహస్రాక్షము.

## తృతీయాంకము.

[స్థలము సత్యలోకము. ఉద్యానవనము.]

బ్రహ్మ—సతీ! భవత్కుచకలశవర్తులత గామించి దాడిమీఫలములు ధూమమున కభిముఖంబులై తపంబు గావించుచున్నవి.

వాణి—వనదేవత నీపై గలబాళిచే సుస్నిగ్ధకోరకంబుల నెపంబున నీరాజనప్రదీపాంకురంబులు కల్పించుచున్నది.

బ్రహ్మ—ఇటు చూడుము. ప్రవాళకాంతిసమంచితంబు లగుమాకందకిసలయంబులు నీప్రేరేపణంబున నిక్షుశరునిబాణంబులువోలె గన్పట్టుచున్నవి.

వాణి—

గీ. విరహిజనదుఃఖకారణభీకరములు
పిల్లకోయిల లివియె సంప్రీతిమెయిని
లలితముగ "కూ" యటంచు కల్యాణగీత
ములను వినుచుచు నుండె నీమోరఁ గనుము.

బ్రహ్మ—చెలీ! ప్రళయవాతోద్ధూతతుంగతరంగసంగతతిమితిమింగల మకరనికరకరాఘాతకోలాహలముఖరితదశదిశావకాశంబగు సముద్రంబును మనలోకములోని పుండరీకసమాచ్ఛాదితంబును బిసవ్రాతదంతురితంబును ప్రతిబింబితోపాంతపాదపప్రకరంబును నగునీకమలాకరంబును బొడగాంచి లావణ్యవంత మెయ్యదియో నిర్ణయింపుము.

వాణి—సర్వజ్ఞు లగుమీా రుండ నే నేమి నిర్ణయింపనలెను. (కనుగీటును)

బ్రహ్మ—చూచితిని. ఇంద్రుఁ డిటనే మందారతరుచ్ఛాయ నాసీనుఁడై పెదవులు విప్పుచుండెను, ఈవంక కేగుదముగాక.

వాణి—తాపభరంబున నిట్టూర్పులు పుచ్చుచున్నాఁడు.

బ్రహ్మ—మోహహాలాహలం బతనిని దహించుచున్నది. చూడుము,

గీ. చెలఁగి యడవులఁ గాల్చుకార్చిచ్చుకన్న
అడరివార్ధి రేఁచుహాలహలముకన్న
బహుళకష్టాకరదరిద్రబాధకన్న
మోహ మధికంబు సంతాపమూల మరయ.

వాణి—శునాశీరుఁడే మియో ప్రలాపించుచుండె.

బ్రహ్మ—మన మీాకెలన విహరింతము రమ్ము.

ఇంద్రుడు—(పొంత నున్మీలితాక్షుఁడై) ఏమి యీావిధాతృతనుకల్పనా కౌశలము.

సీ. ఏటివెంబడి నిరాఘాటంబుగా సాగి
చనెడుకాంచనకలశద్వయంబు
ఉరుమారుతోచ్చలదూర్మి పంక్తులఁ దోఁగు
చలువన్నిగ్గులు దేఱుజక్కవకవ
నునుసోఁగదీఁగల నెనసి వట్రువ లౌచు
జాలువాఱెడు స్తనస్తబకయుగళి
స్వర్గదీపీచికాసారపరిప్లుత
గురుతరస్ఫురకుంభికుంభయుగము,

గీ. స్మృతిఁ గొనివచ్చు నెంతయు నెన్ను మిగిలి
తనసుధాపూరకాంతి సంతానమందు

ముక్కలను వేయుమెఱుగుల మొత్తము లగు
తన్వికుచపాళి నెదలోనఁ దలఁతు నెపుడు.

బ్రహ్మ—మోహవిషము తల కెక్కినది.

వాణి—సుందరతనుసందర్శన విదాహదోహలం బగు నీవెంగలిమోహంబునకును, ధర్మాచరణసాహాయ్యైక మగుప్రేమకు నెంతవ్యత్యాస మున్నది.

చ. ధగధగమండి, కాననహుతాశనుఁ డేర్చి వహించుగీలలన్
నిగనిగతళ్కులన్, భువిని నించి సుధాసవ మాను వేల్పులన్
సొగియఁగఁ జేయుచంద్రుఁడు, విశుద్ధతరాంశుల బొల్చియట్టులన్
బొగుల నొనర్చు మోహ మతిమోదము బ్రేమమజస్ర మిచ్చెడున్

ఇంద్రు—

కం. సౌరభవిహీన మైనన్
సారప్రసవోత్కరము, నసారంబ యగుం
జారుతటిల్లత నెడసిన
వారిధరప్రభయుఁ గూడ వ్యర్థంబ యగున్.

కం. నానంసారం బాకాం
తాసంగతి దొరయకున్న తరళజలాంచ
త్కాసారము రాయంచల
వాసంబుగ తునరియట్ల వ్యర్థంబ యగున్.

తరుణీ ! సుస్నిగ్ధకపోలసరోవరకేలితకరకమల మగునీమనోహరాకృతి యెవరిని వలపింప కుండును?

బ్రహ్మ—నిన్ను దప్ప మ తెవ్వరిని వలపింపదు.

ఇంద్రు—యువతీ! మనోజపుష్పభల్లంబుల పోటులకులికి భయభ్రాంతుండ నైననన్ను నీమధురాలాపమంత్రంబుల నాశ్వాసింపఁగ దే! నఖాంకురనూత్నహరిణాంక రేఖాభ్యుదయంబు నీవక్షోజపర్వత

శిఖరంబుల గల్పింప ననుకూలంబు నేసి మదీయవిరహాతాపాంధకారంబు మాయింపుము! మందస్మితసుందరవదనారవిందవై నా పేరిటికన్నాళులదప్పి దీర్పుము. నీతొంగలి రెప్పల నప్పళించుబిసాళిచూపుల నమృతంబుఁ బ్రసాదించి మోహదాహదందహ్యమానం బగు దేహంబును జల్లవఱుపుము. వెచ్చనై సౌఖ్యసాంద్రం బగునీపరిష్వంగంబుచే నన్ను నానందసామ్రాజ్య పట్టాభిషిక్తుఁ గావింపుము. (ఆలింగనము చేయబోయి, ఏమియుఁ గానక, పూర్తిగఁ గన్నులు విప్పి) ఓహో! ఇదేమి! బట్టబయలు!

వాణి—మ తేమనుకొంటివి! నీగుట్టు బట్టబయ లైనది.

ఇంద్రు—

గీ. మృదులపల్లవవిసరంబు మేసిమేసి
కోకిలం బేల కూసెడు కొసరికొసరి
సుందరరసాలపాదపబృందవీధి
నాదుహృదయంబు నగలింపఁ గాదె యిపుడు.

అరుణకాంతివృతరమై పశ్చిమంబర కకాంతుల వెదజల్లెడు. ఈ సమయంబున—

బ్రహ్మ—మబ్బులు దిశాముఖంబుల నావరించుచుండె. బహుళపక్షంబు, చంద్రుఁ డింక నుదయింపకున్నాఁడు. సతీ! అటుచూడుము.

ఇంద్రు—

చ. శుకములు పల్లటీ ల్గొనుచుఁ జొచ్చెడు నల్లదె కోటరంబు లం
శుకములఁ గప్పుమానినులచొప్పున వే ముకుళించె పద్మినుల్
ప్రకటసుమాత్రసంకలితపాణిసరోరుహలై నమారుడీ
వికటతమస్సమాళితతి వెంబడి దాడి యొనర్పఁ జూచెడుఁ.

బ్రహ్మ—

సీ. కలధౌతగిరికూటకమనీయతటమున
వటపాదపచ్ఛాయ వరలుపీఠి

మందారమల్లికామకరందబిందు స
మాకృష్టమధుపసంభ్రమము లోలయు
పశ్చాద్దిశాహిమప్రస్థాద్రి సెనసెడు
తెలిమెద్దుఱంకె ప్రతిధ్వనింప
హస్తినక్తువిలాప మపనయింపఁగ గౌరి
యోడుపల్కులఁ జెవు లలరు చుండ

గీ. మౌళిభాగీరథీతరంగాళులందు
లీల బాలామృతాంశుఁ డుయ్యాల లూఁగ
నెసఁగు చుండెడుశంకరుం డసితరాత్రి
పై కొనినయంత వేచె శుభక్రమార్థి.

వాణి—భువనసంచార మింక శంకరుఁడద్రిజావిరహితుండై యొన ర్చువాఁడు. నాకాధిపుఁడు విప్రలంభవేదనాదూయమానుండై యుండెడె. ఈవిషయమున మన మేమి చేయ నగు.

బ్రహ్మ—ఈశ్వరుం డితరకార్యమగ్నుం డగునితనిఁ గాంచిన నాగ్ర హించుట నిజము.

ఇంద్రు—

గీ. మోహరించి ముక్కంటితో మున్ను గొంటి
వంగనాశనము ననంగ! అడరి యిపుడు
నన్ను మార్కొనునిన్ను గాంతావిలోక
బద్ధునిగఁ జేతు స్వాతంత్ర్యభాగ్య మేడ.

వాణి—పిచ్చి ముదిరిపోవు చున్నది. మన్మథునిపుష్పధనుర్ముక్త ము లగుభ్రమరఝుంకారగుణక్వణనసముద్ధతమోహాళిలీముఖంబు లకులిక్కి యింద్రుఁడు బాహ్యప్రపంచమునేమఱు చుండెడె.

బ్రహ్మ—ఇట్లగుగాక. (ముందునకు వచ్చి) విజయా! ఇటు జాటు ము. (ఎలుగెత్తి) భూమినంతయు నెవండు రేపు రేపకడఁ జుట్టి

రాఁ గలఁడో వానికి నాయనుంగుఁగూఁతు నహల్య నిచ్చెద.

విజయుఁడు—(నేపథ్యమున) చిత్రము!

వాణి—ఇంద్రుఁ డదరిపడి లేచుచుండె. ఇఁక గృహాభిముఖుల మై పోదము.

ఇంద్రు—(అదరి ఎదురేగి) పూజ్యపాదులారా! నమస్కృతులు.

బ్రహ్మ&వాణి—ఆశీర్వచోపురస్సరంబుగఁ గుశలసంప్రశ్నము.

ఇంద్రు—మీకృపావశంబున నింతవఱకు క్షేమమే.

వాణి—(స్వ) ఇఁకపైన క్షేమము!

ఇంద్రు—తల్లీ! మీ రింతవఱకిటనే విహరించుచున్నచందము గన్నట్టిడు. చూడనందులకు క్షమింపుఁడు.

వాణి—త్రింశత్కోటిదేవతాపాలననిమగ్నుఁడ వగు నీ కెన్నియో కార్యములతొందరలు.

ఇంద్రు—తొందర లేవియు లేవు.

వాణి—విచారమగ్నుఁడ వని నీముఖము చెప్పక చెప్పు చున్నది.

ఇంద్రు—(లజ్జావనతవదనుఁడై) రక్షణకై కంకణము కట్టి మీరు నాపైఁ బ్రిపూర్ణదయారసప్రసారము సేయుదాక విచారమునకు హేతువే లేదు.

బ్రహ్మ—మందిర మల్లదే! చేరుదము.

ఇంద్రు—(స్వ) అచ్చట ద్వారము నోర్వజేసికొని శివార్ధశరీర యగుభవానిభాతి నిల్చి యహల్యను దవ్విగాఁ గాంచి నాకమునకరుగుదుగాక.

వాణి—అహల్యావివాహవిషయికవార్త నాలించితివా?

ఇంద్రు—(స్వ) విన కేమి! (ప్ర) ఏమని? మాతా!

వాణి—ఎల్లుండి రేపకడ భూప్రదక్షిణంబు గావించి వచ్చువాని కొసంగుదు మని.

ఇంద్రు—(స్వ) ఇది యెంతపని? కుబేరునిపుష్పకము నడిగి దాని లో నిమేషమాత్రమున ప్రియాణసర్వస్వము గావింతుకాక.

బ్రహ్మ—ఆపరుగిడివచ్చువా రెవరు?

ఇంద్రు—(ఆవంకఁ జూచి) మందారుఁ డేల యతిత్వరితంబుగ నడ తెంచువాఁడు.

మందా—(వచ్చి) సత్యాధినాథులారా! వందనము. ప్రభూ! మ హేంద్రా! లంకాధీశుం డగురావణుండు మేఘనాథునితోఁ గూ డి యశంఖ్యాకంబు లగుదైత్యదానవబలంబులతో నరుదెంచి య మరావతిని ముట్టడి నైచి యున్నాఁడు. నిలింపులు గుంపులుగూడి క్రుద్ధులై యుద్ధసన్నద్ధులై ఘోరితంబునకుఁ బోయిరి. వెంటనే ప్రోలికి రండు.

ఇంద్రు—(ససంభ్రముఁడై) పంక్తికంఠుఁ డింతకు వచ్చెనా? పుష్ప కాహంథుఁడై గుబేరుఁడు—

మందా—(అర్ధోక్తిలో) ఆవిమానము నెన్నఁడో మూతిపండ్లు విఱు గఁ దన్ని రావణుఁ డన్నకడనుండి గ్రహించెను.

వాణి—నువ్వంతవిసము నూఱుకాకులఁ జంపునట్లు రాక్షసులు వర బలదర్పితులై రా, యెంతయేని జేయఁగలరు.

ఇంద్రు—యముఁడు కాలపాశహస్తుఁడై—

మందా—యమునితోఁ బోరింతకే ముగిసినది.

ఇంద్రు—వరుణాగ్నులు?—

మందా—వా రెక్కడ? పిఱికిపందలై తలఁ దాఁచుకొనిరి. సూర్య చంద్రాదులు కాందిశీకులై రావణునాజ్ఞ వెఱతురు.

ఇంద్రు—కానిమ్ము! రావణుఁ డెంత? మేఘనాథుఁ డెంత?

మందా—పిల్లయైనను పులిపిల్ల చెడ్డదే.

ఇంద్రు—నిక్కువము. సూదికి బెజ్జ మున్న దని జల్లెడ వెక్కిరించి

నట్లు పరిపంథిబలంబును బరిహసించుట దిక్పతులు లేక, తెక్క-లూడిన పక్కి-వలె నైన నాకుఁ దగనిదియ! ధైర్యం సర్వత్రసాధన మ్మనుగీష్పతియుపదేశ మనుసరించెద. మందారా రమ్ము. కమలాసనా! మహాత్మా! దయయుంచుము. జయంతాదులతో నడవి కేగుటయో, జయించుటయో యగును. మీబలము నండగొని వెడలెదను. మాతా! పోయి వచ్చెదను.

బ్రహ్మ & వాణి—నీవవిజయశీలివి కమ్ము.

ఇంద్రు—ప్రసాదము. (మందారునితో నిష్క్రమణము.)

బ్రహ్మ—అమితదర్పసముల్లసితుఁడైన మేఘనాధుఁ డింద్రజిత్తగును. కాని విజయమాత్రాకాంక్షి యగు రావణునకు రాజ్యార్జనాభిలాష లేమి, యింద్రునకు దేవలోకత్వ ముండును. ఇదంతయు నొకదినములో జరుగఁ గలదు.

[తెరపడును.]



శ్రీ

# అహల్యాసహస్రాక్షము.

## చతుర్థాంకము.

(స్థలము: సత్యలోకము: బ్రహ్మభవనము.)

1తపస్విని:—అదే గౌతము డాచతుశ్శాల నలంకృతుఁడగు చుండె. పద్మిణయు శృంగార మంగీకరింప నహల్య నిటు తెండు.

2. తపస్విని:—ముత్యాలచవికెయందు జలక మార్చితిమి. రక్తకాంతిసుందరం బగుపరిధానంబు నిప్పుడే దొడిగించితిమి. ఆమెవినీల చికుర కలాపంబులచివర మౌక్తికంబుల వోలె దొరగుకణంబు లురులఁ ద్రోచితి మి. పసిండికుండల నిర్మలజలంబులఁ గొని పుణ్యాంగన లేతెంచిరి. ఇట కనకాస్తరణం బునుప్పుఁడు.

1 తప:—క్రొత్తపెండ్లికూఁతు రగుట పాప మహల్యకు సిగ్గు.

"గౌరికల్యాణమే! శోభానమే! వైభోగమే!

ఏమే!—నీగొం తింతకలుపరా దకే

2 తప:—కాని; పసపు తీసికొనుము

(అందఱును కల్యాణముపాట బాడుదురు)

3 తపస్విని:—అహల్యా! రమ్మమ్మ. అమలకీలాఘృణిపరీత మగుభర్మశలాకవోలె నరుణపద్మభాభాసురం బగువస్త్రంబుతో వెల్గునీయొడల ననల్ప రత్నాకల్పరుచిఁ గైసేయుదును.

అహల్య:—(వచ్చి) నాకేసొమ్ములును వలదు.

2 తపస్విని:—బిడ్డా! ఈపెడిపట్టంబును మణులపతకము స్వర్ణమేఖల కట్టుమని వాణి యిచ్చె వల దనకు. నీవాలారుంగనుగొలంకుల కాటుకరచింతుము.

అహల్య:—(స్వ) నిర్మలకౌశేయసమాచ్ఛాదితసర్వాంగుఁడగుఁ నా మన్మథుని కలంకారములు దొడుగ కుండియు నతని సౌందర్యము వెల్లివిరియు వెన్నెలవోలె చిత్తము నాకర్షించెడు. సహజలావణ్యమే లావణ్యము. తొడవుల నుడుపుట నొడలికి సౌందర్యమొసగవు.

వాణి:—(వచ్చి) కుమారీ! ఈపారిజాతంపుఁ గ్రొన్ననలదండ నతుత ధరింపుము.

అహల్య:—ప్రసాదము. (ధరించి) (స్వ) సరస్సులోనిసరోజమువిధాన, వితరణమున బొందుపడిన ధనముభాతి ధర్మము దెచ్చిన కీర్తిక్రియ, దయా విశిష్టం బగుప్రభవము జెన్నున తపస్త్రీజోస హ్యాంబగునీ తనితనువున కీమాలిక సరిపోవును.

వాణి:—బిడ్డా! మునికాంతలు గొనివచ్చిన యాభూషణంబుల నిరాకరింపకుము. వారిపల్కుల నాలించి తదాశీఃపరంపరాభి వర్ధితయశవు కమ్ము.

అహల్య:—(స్వ)

గీ॥ పటుజటామధ్యలసితేందుభాస్వరుండు
శివుని జెన్నునభాసిల్లుశిష్టుఁడితని
పాదయుగళంబునాదు హృద్భాగమునకు
తరళతరరుచిస్ఫూర్తినిదాల్చుగాక.

ఈభూషణంబులేల? అయినను పూజ్యులయాజ్ఞను జవదాటఁ గూడదుగదా? (భూషణములధరించును)

వాణి:—తల్లీ! ఇఁక నిట మూఁగియున్న పుణ్యాంగనాజనసహస్రంబులకు నమస్కరింపుము.

అహల్య:—(స్వ) ఆర్యపుత్రుని కోమల కుసుమదామముచే నలంకరించినయాకాంతాకరయుగళి పవిత్రీకృత మయ్యె. అట్టి పవిత్రతలో లేశ మాత్రమేని బొందనియీకరంబుల నెట్లు మొగుడ్తును.

చ. మృదులముగా నఖాగ్రముల మేచకదీధితిఁ బొల్చు పెన్నెఱుల్
విదిరిచి పూలజుట్టు నదె వేడుక నొక్కలతాంగి దృశ్యమై
యొదుగుచు లేచు లంబజలదోత్కరము క్షతటిల్లతాప్రభల్
గదురగ నట్టిభాగ్యమును గాంతువు సంభ్రమ మేల జిత్తమా॥

బ్రహ్మ:—(గౌతమునితో గూడ బ్రవేశించి) కుమారా! ఇవ్వరవర్ణిని కరంబు గొని యీపుణ్యాంగనాజనావలికి నిమ్మహర్షిసందోహం బున కుఁ బ్రీణమిల్లుము.

అహల్య:—(స్వ)

సీ॥ సితసుమబద్ధంబుచికురజాలంబుతో
రవువెన్నుపైన జీరాడు చుండ
సలలితోరస్సీమ గలితమృగాజిన
మై వెలిజన్నిద మమరు చుండ
మడతలు దీర్చిన మడుగుపుట్టము కటి
నుండి పాదముదాఁక నొరయుచుండ
అతివి శాలోన్నతం బైనఫాలము మీఁద
వన్నెనా బొట్టొండు వరలు చుండ

గీ॥ శుభ్రధవళోత్తరీయుఁడై యుభ్రకేశు
స్మృతికిఁ గొనివచ్చుమహనీయసుందరాంగు
నితని వరియించి యగజాత యీమె యనఁగ
పతికి ననుకూలనై జన్మఫలముగందు.

గౌత:—

చ. పెనగెడులజ్జ, చూడ్కులను బ్రేమకునోడగ, పాణికంకణ
క్వణనములుల్లసిల్ల, జిటిగొనసిగ్గూడుచునుండ లాజలర్
మణినికరంబునుచ్ఛ్రిరముమండనమండితమై యొసంగఁగా
వణకెడు కేలఁబోయుమగునర్ మనసాదలపర్ దొడంగితే॥

(వివాహకార్యములుసక్రమముగానడచును)

అహల్య:—(స్వ)

సీ॥ ఆశుశుక్షణికి నుపాసనం బొసఁగుచో
కేలు కేల దెమల్చులీల దలఁప
అంబరగ్రంధ్యుత్సవారంభమందున
న గుదళుకొత్తు నాననము దలఁప
ధ్రువపథవీక్షణోత్సుకత గండమ్ముపైన
చెక్కిలి నొరయించు చెన్ను దలఁప
పతిహితైషిణులమేల్బంతి కెక్కినయరుం
ధతి జూపుధర్మతత్పరతఁ దలఁప

గీ॥ బ్రాహ్మణవ్రజాశీరభివర్ధితంబు
నగు నమస్క్రియ నన్యోన్య మొరసికొనుచు
మఱగి చూపులఁ జూచెడు మమతఁ దలఁప
పులకరించెడు మేను నుప్పొంగు మనసు.

నందపాలుఁడు:—(దంపతులు నమస్కరించిన గని) తల్లీ! పతివ్రత
వై చిరకాలము మనికీర్తనీయ వగుము. పుత్రా! సుఖుఁడవుకమ్ము

బకదాల్భ్యశ్రైభ్యకులు:-(నమస్కరించుగౌతమాహల్యలఁ గాంచి) స
తీపతులారా! సకలాభిమతసిద్ధిరస్తు.

బ్రహ్మ:—మహర్షిపుంగవులారా! ఇఁక మన మహల్యను, గౌతమునిం
టికనుప ననుజ్ఞ యొసంగెదరా?

(ఎలుగురాల్పడ)

గీ. వీరువారును భేద మేవిధని లేక
కువలయాఖిలసృష్టిద తుండ నాక
సాకతము బేర్మి నిటుమానసము గలంగ
నెటు త్యజింతురో తనయల నేనెఱుఁగ

నేకపుత్రిక లగువార ళినునికడకు.

మహర్షులు:—మహాత్మా! నీవ యింతదురపిల్లిన లోకులమాధ్యమున
కు చింతింపఁ బనియుండదుకదా!

బ్రహ్మ:—చక్కఁగా మందలించితిరి. బిడ్డా! అహల్యా!

చ. పతిచరణాబ్జయుగ్మము నపారతపోమహిమాంచితంబుసం
చితబహుపుణ్య మెయ్యెడ నశేషమచంచల మైన భక్తితో
హితమతి వై భజింపుము సహిష్ణుతఁ గల్గ చరింపు మన్నిటన్
బతికృత మేకృతంబనఁగ భాసిలు మమ్మ భవాని మించుచున్

మహర్షులు:—కాలవిలంబ మేల? విషఘడియ లారంభ మయ్యెడిని.

వాణి:—అమ్మా! సంయములయాజ్ఞ యైనది. సత్యలోకమునుండి
యవతరింప వలయును.

అహల్య:—(ముందున కడుగిడి) తల్లీ! పోయి వత్తునా?

వాణి:—అమ్మా! పోయి రమ్ము. ఇదె కనుంగొనుము.

గీ. చిఱుతపాయమునుండియుఁ జెంతఁ జేర్చి
ఎఱకలను జక్కఁజేయుచు నెపుడుపాలు
కుడువఁ బెట్టుచు సాఁకితి, విడువలేక
వెంటఁ బడియెదురాయంచ గంటివొక్కొ.

నర్మ:—నీహంసకంబులయులివునకు మఱగినదివోలె వెన్నంటునీ
మరాళరాజంబు నెట్లు సమాధానపరచెదవు.

అహల్య:—(హంసము మేను నిమిరి) నెయ్యంబునంజేసి నిన్ను విడిచి
పోవ నాకును గాళ్లాడకున్నవి. నీడోద్భవశ్రేష్ఠమా!

సీ. నాకకల్లోలినీశీకరంబుల దోఁగు
పుండరీకంబుల పొందు గాంచి
శరదాగమస్ఫూర్తి నలుదారు గౌముదీ
ద్యుతులతో సరి తులదూఁగ గాంచి

సాంధ్యారుణపరిభాసాంద్ర మయ్యును దెలి
జిగి వెట్టుమల్లెల చెలిమిగాంచి

కలభా:—భవదీయకుచతలప్రాలంబి మౌక్తిక
తరళహారంబుతోఁ బెరయ గాంచి

అహల్య:—(అట్లనే మరలఁజెప్పి)

గీ. యొసఁగునిన్ను మరాళమా యొడపి లేక
తనివి నొందించుగావుత తమఃకమునను
వాణి బిసనంతతులచేత, వత్తు నిన్ను
జేర నెప్పుడైన నీకథల్ జెవులఁబడఁగ

(మోకరించి హంసను ముద్దిడి) లీలాశుకమా!

బ్రహ్మ:—కుమారీ! ఆలసింపకు

అహల్య:—

గీ. మధురభాషణంబులతోడ మహితగతుల
తోడ నీయంగకమ్ము లస్తోక ముదము
నాకు నొసఁగుచు నుండెనీనాటిదనుక
అండజంబ! సువృత్తచయంబువోలె
సెలవిచ్చెద వే.

నర్మద:—అహల్యా! ఇదె చూడుము. భవనద్వారము దాటి పుష్ప వాటిక కరుదెంచితిమి. చిన్ననాటినుండియుఁ బ్రోదిఁ యొనర్చి పెంచితి నని శుకహంసములకై యింతవగచునీవు మాటలురాని నోరులేని యీమాధవీలతాసహకారకుమారుల నెటుల వీడి కొనియెదవో?

కలభా:—

గీ. పులుకడిగినట్టి ముత్తెము పొలుపు మీఱి
స్మధుపయోధర శిఖరుల పిదిలి దొఱగు

సకుశ్రీకణపారసంతతు లబలయొసగె
తరుణమాధవీసహకారదంపతులకు.

నర్మ—తలోదరీ! యీయేలావనంబులు దాడిమీతరులు, చాంపే యములు నారంగంబులు, కమలకాసారంబులు, కేళీగిరిగుహాకం దరములు, పుష్పవిడియేరులు, పాండుసైకతంబులు, చంద్రప్రస్త రవేదికలు, ఘుమఘుమ వాసించుగుబురుపూపొదరిండ్లును, ద్విరే ఫధ్వానసంతతంబు లగువసంత నిశాంతంబులు మొదలగు స న్నియువిడిచి మాడెందంబులనుమ్మలకమ్ము గ్రమ్మించితివి. పీ నినన్ని టినిగనునెడనీమధురాలాపములు, నీప్రణయాపాంగ వి లోకనములు, నీకృతకకోపములు, మనసుననాటిచింతఁ జెందించు.

కలభా—మగనియింటికిఁ బోవుచుసంభ్రమమైనవత్సణముఁగాంచిన కురంగి తెఱంగున మమ్ములను మఱచి వెడలి పోవుచున్నతన్వి తోనేలయిన్ని పల్కులు?

నర్మద—ఔను పోయివత్తునని కూడ చెప్పదు.

అహల్య—(వెనుదిరిగి) చెలులారా! వృథాదూషణలేల? వివాహ మారోహించునెడ, వచింతమనియుంటిని. నన్ను క్షమింపరా (కే లోడ్చును)

నర్మ& కలభ—(అహల్యనుగౌఁగిలించి) చెల్లెలా! మమ్ములను మఱ చిపోకుము. అప్పుడప్పుడు వచ్చు నారదునితో నైన, లేక నీదుది వ్యమగుపావురముచే నైన నీకుశలంబులను బుత్తెంచుచుండుము.

అహల్య—అట్లనే!

బ్రహ్మ—కుమారీ! సత్యభువనపుసరిహద్దుఁ జేరితిమి. మీరికవైమాని కులు గావలసి యున్నది.

అహల్య&గౌత—(వాణీబ్రహ్మలకు ప్రణమిల్లుదురు—

వాణీ & బ్రహ్మ:—సకలసౌఖ్యప్రాప్తిరస్తు.

అహల్యః—(అంజలిఘటించి)

సీ॥ వేదఘోషణలచే వీనుదోయికి నింపు
నలవర్చునట్టిమహర్షులార!
కడఁగి పాతివ్రత్యగరిమచే ధన్యలై
దనరారుకాంతామతల్లులార!
వరధర్మనిరతిసంవర్ధిష్ణు తాశుభ
ప్రదసత్యలోకనివాసులార!
అమలానురాగార్ణవాంతశ్చరిష్ణులై
నాతోఁడమన్నప్రాణంబులార!

గీ. తగువిధాన బెంచిన తల్లిదండ్రులారా!
యెల్లరికి నంజలిఘటింతు నిద్ధభక్తి

కలభాః—

మాయహల్య యజస్రంబు మహితభాగ్య
విలసితగ నుండ మీరు దీవింపుఁ డయ్య.

అందఱుః—తథాస్తు.

[తెరపడును.]





# అహల్యాసహస్రాక్షము.

(పంచమాంకము.)

---

## —◆ విష్కంభము. ◆—

(నందనోద్యానవనము స్థలము.)

నేపథ్యమున:—(భేరీధ్వనులు. గుఱ్ఱములచప్పుడు, నేమిస్వనము)

[ఇంద్రుఁడు—మాతలీ! రథమును త్వరగ పోనిమ్ము. నే నిదే నందనోద్యానమున విశ్రమించెదను.

మాతలి:— అట్లనే! పిమ్మట?

ఇంద్రు:—ఇటకు రమ్ము.

మాత:—చిత్తము.]

(ఇంద్రుఁడు రంగమును ప్రవేశించును.)

ఇంద్రు:—ఎవఁడురా అక్కడ?

తోటమాలి:—ఆ! ప్రభూ నేను సుమాలిని.

ఇంద్రు:—పూసెజ్జ నమర్చితివా?

తోఁట:—ఇట్లు రండు (త్రోవచూపును.)

ఇంద్రు:—పారిజాతనగచ్ఛాయతో నేసితివా? తల్ప మేమైనది?

తోఁట:—పొద్దున నిక్కడ నమర్ప మంటిరి.

ఇంద్రు:—ఓ మఱచితిని. [స్వ] ఈపాడురావణుఁ డెటనుండి వచ్చెను. [ప్ర] సుమాలీ! ఇఁక పొమ్ము. కదనమున శత్రువులరహస్య వ్యాపారములు గనఁగొని రమ్మని మందారునకు చెప్పియుంటిని. వచ్చెనేమొ?

తోఁట:—ప్రసాదము. చూచివచ్చెదను. [పోవును.]

ఇంద్రు:—పూర్వము దైత్యు లింతయహంకృతి చూప లేదు. కాని యాలంకావాసులు.

(మాతలివచ్చును.)

మా:—చాల గడబిడ చేసిరి.

ఇంద్రు:—అబ్బా! ఈసారి యూపిరితో వచ్చితిమి.

మా:—ఇం కొక సారి యుబ్బసముతో వత్తుము.

ఇంద్రు:—ఎట్టిసాహస మొనరించితివి.

మా:—అబ్బబ్బ! ఎంతసాహస మెంతసాహసము.

సీ. ఎద్దులు వోయంగ యేఱులై పాఱంగ
లంఘించి లంఘించి లాఁగు నితఁడు
బల్లెంబు తీసుక బల్లిని చంపెను
బలవంతుఁ డింద్రుండు భలె! భలె! భలె!

ఇంద్రు:—చాలును.

మా:—యుద్ధము విడిచి పఱుగెత్తి, గబగబ, దడదడ రథ మెక్కు వేళకు కన్పడిన మడమ లెంతగుండ్రములు?

ఇంద్రు:—"జీవన్ భద్రాణి పశ్యతి" కాలముగాని వేళ కదనమువలదు.

మా:—మీవంటిపరాక్రమశాలి కిట్టినీ తియేగురుఁడు చెప్పవలయును. సమయజ్ఞుఁడుగదా గురువు.

ఇంద్రు:—వేళాకోళము. వరగర్వితునితో డనా పందెము.

మా:—అమృతముద్రావి చావులేని దేవతాచక్రవర్తియా పరుగెత్తుట.

ఇంద్రు:—ఛీ! ఛీ! విధి పురాకృతకర్మపరిపాక మని మూఢులకుఁ దెలియదు.

మా:—నీతాతలకాలమునుండి యున్న నేను మూఢుఁడనే. ముందు వచ్చిన చెవులకన్న వెనుక నిక్కినకొమ్ములే వాడవు. పాపము! ఇంద్రుఁడు బహుబుద్ధిశాలి. ఈమాతలి—

ఇంద్రు:—(అర్ధోక్తిలో) కట్టిపెట్టుము. కన్నారచూచి తెలియకుంటివి.
మా:—చూడక నీవు తెలియ కుంటివి.
ఇంద్రు:—ఏమిచూడక
మా:—పరబలపరాక్రమములను—రావణుసింహాలంకృతిని
ఇంద్రు:—చూచితిని.
మా:—నిజమే. హృదయఫలకములోని యూర్వశిని
ఇంద్రు:—ఊర్వశియా? అహో లావణ్యము. అహా—
మా:—ఎవరిలావణ్యము
ఇంద్రు:—అహల్యాలావణ్యము
మా:—బ్రహ్మకల్పిత యగు నహల్యాబాలిక. నీవుతాతవు. ఆమె లావణ్యముతో నీ కేమి?
ఇంద్రు:—ఏమియు లేదు. రావణు నెట్లు జయించుట?
మా:—ఈచాంచల్యమే నిన్ను జయించినది. పరస్త్రీబలాత్కృతి దూష్యము. అందరానిదాని కఱ్ఱుత్తుట.
ఇంద్రు:—అ దెట్లు
మా:—ఆమె బ్రహ్మతనయ. నీకు సోదరీసమ.
ఇంద్రు:—చీఁకటిలో నేమిబాంధవ్యము!
మా:—అధర్మములో జయ మెట్లు? వృథాడంబరుఁ డగుని .స్వీడి భూపతి నెవనినేని దెత్తు మన్న జనకుఁడు జ్ఞాని—దశరథుఁడు ముదుసలి—రాముఁ డిప్పుడే విశ్వామిత్రునికడ విలువిద్యనేర్చెను.
ఇంద్రు:—సాంగ మైనదికదా
మా:—ఐనది. దాననే హరుధనుర్భంగమునకై మిథిల కరిగెడిని.
ఇంద్రు:—ఏమి. పరిణాజ—
పై నుండి:—గౌతముఁడు వివాహితుఁ డగు చుం డె(కలకలము) సత్యలోక మింక డగ్గఱినట్లే.

మా:—గౌతమఋషి సంసారి యగునా. నూతన్న మహర్షి దంపతులకుఁ గట్నము లంపుట మనవాఁడుక.

స్మైసుండీ:—గౌతముఁడు బుద్ధిశాలి. రూపగుణములు మేళగించిన యహాల్య సరిపోయినది.

ఇంద్రుఁ:—(అసరి) హా హా వాణి యొనర్చ్పనక్కట్టడినిః మఱచితిని. కాంలము మించెను. అమృతకలశము చే జారెను. ఈపోరు బహాక్లిష్ట మయ్యె.

మా:—సుధకు భద్రముగ సురులు కో పుండిరి. కలవరించెదవా?

ఇంద్రు:—లేదు కాని

మా:—'కాని' పాడు 'కాసి' 'కాని' వచ్చిననే కల్లు నేమైన! 'కాని' ఊఁ! తరువాత

ఇంద్రుఁ:—రథ మాయత్తము చేయుము.

మా:—ఎక్కడికి?

ఇంద్రు:—అయ్యో! అపశకునమా? (కసరుకొనును)

మా:—నీకట్టు రాణికి చెప్పెదను. వాత్సల్యముతో చెప్పు చుంటిని. చెడిపోవకుము

గీ. నిరతసురరక్షణంబున నెగడువాని
పరమపదనాథు భజియింపు మరసి యతఁడు
బ్రోచు గాక, ధర్మంబె సంపూజ్య మగును
దుష్టకర్మవు కష్టసంక్లిష్ట మగును.

(పోవును.)

ఇంద్రుఁ:—పో పో గౌతముఁడు భూప్రదక్షిణ చేసి వరించెను. ఏసను నన్ను మనసునకు గొన్న దో చిన్నది. సురథా!

సురథుఁడు:—(సురథుఁడు వచ్చి) ఏమి

ఇంద్రుఁ:—విమానమును దెమ్ము. అతిశీఘ్రముముగ రమ్ము.

సుర:—చిత్తము. (పోవును.)

ఇంద్రు:—అహో దేవమాన మెంత వేగవంతము. బ్రహ్మమాన మిం కెంత? అప్పుడే రావణవిజయకథాంత్యసర్వస్వము! రాముని అభ్యుదయము. సీతావివాహమే తడవు. రామరావణసమరము. వచ్చె ననికదా విధాతృనానతి. హా! మంచిచెడ్డలు యెదుగుటాకే వేళలో—

సురథుఁడు:—(వచ్చి) విమానము నట నిలిపితిని.

ఇంద్రు:—పద. (న్వ) అహల్యా! నీమీఁదివలపు శత్రువారావృతమగునిజ రాజధానిని విడువ గమకించు చున్నది. న న్వలచినము ద్దుగుమ్మా! ధాత యేలవిపరీతము చేసెను.

సుర:—విమాన మెక్కడికి?

ఇంద్రు:—మహాలోకమునకు.

సుర:—సరే.

ఇంద్రు:—ధాతృవైపరీత్యము—ప్రణయసరణీ—

(ఇరువురు నిష్క్రమము.)

మా:—(పునఃప్రవేశము) ఏలోకము? ఎట్టివెట్టివి. (గట్టిగా) ఉపసన్నమయమునకు విచ్చేసితీరుముప్రభూ—(పోవును.)

[విష్కంభము ముగిసినది.]

(తపోలోకాభిముఖముగ విమానము వచ్చును.)

గౌత:—(విమానారూఢరైయు తనతో నున్న అహల్యను గాంచి) తన్వీ! (కరాంగుళితోఁ జూపుచు)

సీ. అల్ల! మహాలోక మచట నందురుహీర

మల్లికాసితయశోమహితు లెల్ల

ఇయ్యదె! జనలోక మిచట జన్మక్లేశ

రాహిత్య మొందునద్వ్రతులు గలరు

అదె నాక మచ్చట నమరులు ముప్పది
కో ట్లభిమత కేళిఁ గ్రాలు చుంద్రు
మనము డగ్గఱు చున్నమహా తపోభువనంబు
సంయమధనుల విశ్రాంతిపట్టు

గీ. వివిధసుమవాటికాపరివేష్టితంబు
విప్రమనుపఠనార్భటీవిలసితంబు
నైన మందిరమిత్యాదె యతివ! మనము
యానమును డిగ్గి లోపల కరుగ వలయు

అహ—ఆర్యపుత్రా!

సీ. ఒకవంక యామినీయోషిచ్ఛిఖాధృత
సుమములౌ రిక్కలసొబగుఁ గంటి
గగననిమ్నగతరగల నూఁగుహంసంబు
రేతేనిభవి నొకక్రేవఁ గంటి
ఒకదెస ఘనసమీరోత్పతత్కందుక
క్రియ నూత్నమగుజగద్రీతి గంటి
దితిజసేనావృత త్రిదశలోకవిలాస
సర్వస్వమును నొక్కచక్కిఁ గంటి

గీ. కంటి స్వర్ణదీసైకతకాననముల
గంటి ప్రమథగణంబుల గావలహరి
గంటి మీసుసాన్నిధ్యంబు గన్నవాని
కెల్లమేటి సౌభాగ్యమునిదియ కాదె.

గాత—ప్రియసీ! ఇటు ర మ్మిటురమ్ము! శయ్యాభవనం బల్లగున్న మామిడిచెట్లనడుమ విరాజిల్లు చున్నది. కనుము.

అహ—వచ్చితిని (తపోలోకమున దిగినడచి) మరత్రిప్పితిరా! విమానమాగి మెల్లఁగ దిగెను. ఇచ్ఛావిహార మిట్లుండ వలయును.

గీ. అంధకారముఁ గాంతియు నగ్గలింప
రెంటి భేద సైదుబ్రభద్ధ కనమింట్రియందు
ధర్మ మానవిమానంబులపై దరలు దంప
తులకు నిచ్ఛావిహారంబు దొరకునొక్కొ!

గౌత—ప్రియా! దిగు మనునంతలో నీ వే మెల్లగ దిగితివి

అహ—(ముందు వోయి)

గీ. రాగముల ద్రెంచి త్యాగధర్మమ్ము నమ్మి
సారనారయణాంఘ్రిపంకేరుహములఁ
జింతనము సేయుమునులనిశాంత మీవు
లోనఁజొఱనిమ్ము మన్దపోలోకలక్ష్మి!

(కేల్మోడ్చును)

గౌత—తన్వీ! ఏమి యీవాయుపరిచలనము!

అహ—మనము విమానము డిగ్గినయెడ నిట్టిదే రొద బయలు దేఱినది.

గౌత—వేకువఝాము! మందమారుతుని విహారము కాదు గదా?

అహ—ఏమో! (చెవి యొగ్గి) దవ్వున కోడికూఁత వినవచ్చినది. మన్మందిరాళిందంబునఁ గూడ కుక్కుటము మొఱయుచున్నది. చీకట్లు మాత్రము దట్టముగనే యున్నవి. తరుబృందముల నీడలు

గౌత—(అర్ధోక్తి) చంద్రాస్తమయానంతరము తమస్సులో లీనమై సవింకను బాగుగ వేఱుపడుట లేదు. కాని నఖరాయుధములు మాత్రము ప్రాతఃకాలమును దెల్పుచున్నవి. ఇదియు నైసర్గికము కాదా?

అహ—అవును. రండు ఇక్లేల నిల్చితిరి.

గౌత—నేనుషస్స్నానయుకృత్యముల నిర్వర్తించికొని వత్తును ఇదే గృహము ఈవెల్తురు చాటున నిమ్నందారశాఖాచ్ఛాదిత మయి వట్లు గన్పట్టు నిందనీలశిలావేదిక పై విశ్రమించి యుండుము. శీఘ్రమునఁ బోయిస్నాన మాచరించివచ్చెదను.

అహ—నేనును వచ్చెదను.

గౌత—కాంతా నదీతరంగశీతలంబు లగుపవనంబులు మిగులనాయా సముc బుట్టించు. నీవిటనే యుండుము.

అహ—అయిష్టు లగువారిపల్కు ములుకులవోలె నరతగా శీతవా యుసమాహతులు బాధింపవు.

గౌత—అయిష్టు లిట నెవరును లేరు. నిశ్శబ్ద మగునీస్థలము సత్యాభి విన లేదా?

అహ—ఆర్యపుత్రున కిష్టముగానిచో రాను లెండు.

గౌత—ముగుదా! నీరాక నడ్డగింపను గాని వచ్చునంతలో నగ్నియు నుపకరణంబులును జలపూర్ణకలశంబులును సిద్ధపఱచువా రెవరు?

అహ—నే నే.

(ఊర్ధ్వముగా తపోలోకాభిముఖంబుగ;నింద్రునివిమానముమఱొక దె స రంగమున గన్పడును)

ఇంద్రు—(విమానారూఢుండై ప్రవేశించి) సురథా! గమనమును మందీకరింపుము.

గౌత—విద్యుత్కాంతిమంత మగునీభవనంబునకుc బోయి చూడు ము. గృహిణికి వలయు సామగ్రి యెల్ల దొరకును.

సురథు—ప్రసాదము! దేవరయానతినిc గృకవాకువులు కరాహత ములై మొరసినవి.

గౌత—అదే! మఱల కోళ్లు కూసినవి. నత్తునా?

ఇంద్రు—అల్ల గౌతముcడు ప్రయాణ మగుచుండె.

అహ—చిత్తము!

గౌత—పోయివచ్చెదను (నిష్క్రమించును)

ఇంద్రు—ఆనంక సృవంతీ ప్రాంతమున కరుగుచుండె యానమునా పుము కర్మనిరతు లగు విప్రులు ఛాందసులునుమా (స్వ)

గీ. భామినీబలాత్కృత పరిష్వంగసుఖము
తున్న ఖిహిశాచలంబున మున్నుఁ జేసి
పవరుఁ డనుఘాందసుండు విప్రప్రవరుఁడు
నీతిహోత్రునిబలమున, వెన్క కరిగె.

సురధు—ఏమి యనుకొంటిరి?—విమాన మాగినది.

ఇంద్రు—అదిభూలోకవిషయము (స్వ) వరూధినీ కథ

సురధ—ఈతమాలతరుపంక్తిఁ గనుఁడు.

ఇంద్రు—తపోలోకవాసులకు మతింత లౌకికబుద్ధి మాంద్యము. (ముందునకుఁ బోవును)

అహ—శోభావంతమైనయీదీపము మబ్బుల నెట్లు మాయించుచున్నది. (కూర్చుండును)

ఇంద్రు—సురధా ఈవనముఁ జొచ్చెద. నేవచ్చువఱకు నిటనే యుండుము.

సురధు—ఆజ్ఞ! (వెనుక నిల్చును)

ఇంద్రు—(వనముదుంశిగౌతమగృహముకు (జూచి) అహల్యా ఎట్లు కూర్చుండి యుంటివి?

సీ. తిమిరవారము బారుతీర్చి సమస్కృతుల్
నేయఁ గాంచుట నీకుఁ జెన్నుగాదె.
(ముందునకు నడుచును)

అహ—దీపమా!

గీ. దుష్పృధావలంబులచేత దుర్భరంబు
జగతి దానిలో సత్కార్యసరణివీవు
యూరటను జాల గల్పింతు వుత్తమకిర
యారహితమైన భువిమన్కి యకర్మంబు

ఇంద్రు—నీకై నేనజభువిఁ బడినవిరహ మెంత? ఇప్పుడును చిల్కలుమేల్కనుచున్నవే

సీ. కీరంబులా కావు మారుసవారికి
నాధారము ల్మేటిహాయము లివి
భ్రమరంబులా కావు పంచాస్త్రిఘహిమంబు
నాటజాటెడుపాటచాటు లివ్వి
కోయిలలా కావు కుసుమధ న్వనిజయ
స్తుతులను మొఱ సెడుదుందుభులివ్వి
చిలువలా కావు క్రొంజిగురుక్తై దువజోదు
వలపుకాఁకల రేపు భస్త్రిలివ్వి
గీ. ఈతమాలంబు లియ్యెడ నేపురీఱు
నంగజాంధకారంబున కాకరములు
శిఖల నూచుచు నుండె నుచ్ఛ్రితము లైన
కేతనమ్ము లనఁగ నారికేళములిట.

అహ—ఎవరో వచ్చిన ట్లుండె (లేచును)

ఇంద్రు—(ముందునడచి పడసాలఁజొచ్చి) అహల్యా! ఇదె మేఘ వాహనుండు వినయవంతుఁ డగుచుండె.

అహల్య—(ఆశ్చర్యపడి లేచి) (స్వ) తపోవంతునిల్లాలి నగునాకు నితని నాశీర్వదించుట సమంజసంబ యగును. ఇట్లగును గాక (ప్ర) వత్సా! చిరాయువు గమ్ము.

ఇంద్రు:—సుందరీ! భవత్సౌందర్యసుధనుఁ గ్రోలువిషయంబున వ త్తుండనే. అందునఁ జిరాయువుగ నుండు మని సార్థకముగ నిర్దే శించితివి.

అహ:—(స్వ) ఇతనిపలుకు లే ల్లొకో సందిగ్ధములై యున్నవి. (ప్ర) ప్రభూ! ఈతరుణమున నొంటిగ దరుణి యుండుసీవిడి క్షస్థలము న కరుదే నవసరం బేమి?

ఇంద్రు:—నీదర్శనంబు దప్ప వేఱునిమిత్తమే లేదు.

అహ:—నాదర్శనమా ? (అసహ్యముతో) ఆర్యపుత్రుఁడు విచ్చేసిన వెనుక రండు.

ఇంద్రు:—విద్యుత్కాంతిపూరములఁ దొప్పదోఁగు చున్న నీయాలా వణ్య మిప్పుడు గాక మఱెప్పుడు గన నగు ?

అహ:—[పెడమొగంబై] అయ్యా అతిథుల రైనను, కార్యభారము నన్నైన నెరుఁగెంచి యున్న ననిటవిశ్రమింపుఁడు. (లోపలికేగును)

ఇంద్రు:—ఆతిథ్యము గోరి, అంగజునికార్యభారము గల్గి వచ్చితిని.

అహ:—(లోనుండి) వినఁబడుట లేదు.

ఇంద్రు:—కాంతా ! ఇంచుకదయ యుంచి యోసరిల్లుము. అతిథికుప చరింప నీ వర్హవు గావా ? కొన్నిదినములుమునుండె గదా నిన్న జలోకమున దర్శించి భాషించితిని.

అహ:—(స్వ) వినవేమి ? (ప్ర) ఫలములనారగింతురా ? అర్ఘ్యముఁగొనితురా ? పీఠము దెత్తునా ? ఆనతిండు.

ఇంద్రు:—

సీ. భవదధరంబను బరమరుచ్యంబైన

పండుచాలును వేఱు ఫలము లేల ?

అహ:—హరి ! హరీ ! (చెవులుమూసికొనును)

ఇంద్రు:—పలకర్ణేంద్రియములఁ బ్రణయజనితకృతకరోషవశంబున గొప్పముఁ గావించెదు ?

సీ. భవదాలోకనత్పరిష్వంగసౌఖ్యామృత

మానంద మొసఁగు నర్ఘ్యము లవేల ?

తావక నగోసునితంబంబులే చాలు

దంబంబుతోడ పీఠంబు లేల ?

నీదుసల్లాపము ల్నెఱిజనించు మాధుర

తేన్నగా నోరి దానతీయ నేల ? —

అహ:—ఇది నీకుఁ దగనిపని. ఇంద్రా! ఇక్ష్వాకుంత స్వయంవరమ హోత్సవాహూత యగురాజకన్యక గాదు. ఎవరినిగుఱించియో మైమఱచి తహతహపడు చుంటివి.

ఇందు:—ఎవరినిగుఱించి? (కన్నులల్లార్చి)

గీ. నర్మిలిని నిన్ను బొడగన్ననాటనుండి
నాదుహృదయంబు నీమూర్తిమీఁదమఱిగి
ఎడపి లేకుండ ధ్యానించు నిందువదన
మాధవాసక్త మగుభక్తమనసు వోలె.

అహ:—అన్నా! వట్టిబెంగ పెట్టుకొనక పూర్వజన్మవాసనాలబ్ధి గల్గి మాధవాసక్తమగుమనస్సు నుద్దీప్తము జేయుము. పొమ్ము—

ఇంద్రు:—పొమ్మనిపించుకొనుటకా గైతవంబున నీపతి నదికినన్వి నీ పొంతకు నే వచ్చినది. చూడుము.

మ. దివివేష్టించి దశాస్యసైన్యములు నుద్రేకించు చుండఁ జలో
ద్భవసూతిప్రముఖుల్ దమంతట సమిత్ప్రాంతంబున న్నిల్వగా
నవినీతిక్రమ మంచు నెన్నక భవధ్యానంబు నీక్షించి ని
న్గవయన్ వచ్చితి జొచ్చితిచ్చోట నను న్గామింపు మబ్జాననా!

అహ:—ఇంద్రా! ఇట్టివృథామోహమున జెను చుంటివి. బాగుగ నాలోచింపుము—

ఇందు:—వృథామోహమా? ఏమి యోజించుట. ("త్రిదశ" అను చరణముఁ జెప్పి)

సీ. త్రిపథగాసైకతోద్దేశమ్ములన్ హాయి
విహరించుటలు నీకు వేడ్కగాదె
హరిదిగీశ్వరులప్రేయసు లూడిగము లొన
రింప నొప్పుట నీకుఁ బ్రీతి గాదె
నందనతరుచయస్యందిమరందంబు
గ్రోలు టెప్పుడు నీకుఁ గోర్కిగాదె

గీ. స్వర్ణహర్మ్యంబునందు నప్సరసలెల్ల
హాటకస్థగితము డోలికాంతరమున
గూరుచున్నడనూపగా మేరమీఱు
భాగ్యమందుట నీకుఁ బ్రాభవముగాదె!

నన్నుగాక మఱెవ్వరిని వలతువు? తగినవరుండు వేఱెవ్వరు?

అహ:—ఎంతపిచ్చి! స్వరతుణ మైన మాని యిటకరుదెంచెనఁట.
ఈమోహాంధునియెదుట నిల్వరాదు. (ఇటునటు జూచును)

ఇంద్రు:—(ద్వారమున కడ్డమునిల్చి)

మ. మదహస్తీశుఁడు వెట్టియెత్తినపు డేమాత్రంపుటాలస్యముర్
మదికిర్ గిట్టక దత్ప్రియర్ గదిసి యున్మత్తస్థితిర్ మార్కొనర్
గదురర్ గాదె; త్వదంగసంగమము నాకాంక్షించియేకాంత మే
నెదురై నిల్చితి నడ్డమెవ్వరిఁక నా కీవేళ జక్రస్తనీ.

అహ:—(ససంభ్రమయై) ఛీ! దురాత్మా! పతివ్రతల భంగపఱుప
నీచేత నగునా? (వెనుకకు జరిగి) భస్మీకృతుఁ గావించెదఁ జూ
డుము.

ఇంద్రు:—(కేకవైచి) హ్హా హ్హా హ్హా! నీయప్పశాసనమును నీవు వృధ
పుచ్చెదవా? ఎంతసేపని నన్నలయించుతువు? లెమ్ము! మన్మధో
న్మాదము నివారింపుము (కేలు గ్రహింపఁ బోవును)

అహల్య:—హా. ఇది యేమియాగడము, (వనములోనికిఁబరుగిడును)

ఇంద్రు:—(వెన్నంటిపాఱుచు) తన్వీ! మాయాకురంగీ! మోహానాం
గీ. నిలునిల్వుము......నీకుమాత్రము దెలియదా......జాటు
నకై నెమకినదా......ఓహో! పురుషులకు బుద్ధి మాంద్యము.
అహల్యా! మదీయచక్షుస్తపస్సాఫల్యా! ఎటకేగి మాయ మైతివి?

అహల్య:—కట్టా! ఆర్యపుత్రుఁ డింకను రాలేదే (ఒక్కతమాల
ముక్రింద నడఁగును)

క. హాలాపానవిలోలుని
లీలఁ మఘవుండు కామలీలాతురుఁడై
జాలం డెఱుఁగఁగ ధర్మము
నాలింపుమనా 'ధ' ముఁడను హరి! తుష్టహరీ!

ఇంద్రుః—అహల్య. కన్మొఱంగినది. (వెదకి) ఎక్కడను లే దే. ఆ క్కాంత వెలికిరా, నే దేని వెరవు లే దే.

అహల్యః—(జనాంతికముగా) ఈ యంధకార మీనీచునికన్నులను గట్టివైచుగాక.

ఇంద్రుః—(స్వ) భయపెట్టెదను లొంగునేమో

సీ. వరకల్పపాదప మరసి నిన్గొనిరాదె
మెలపున నెటనున్న మీననేత్ర
ఐరావతంబు నిన్నఖిలలోకములందు
వెదకి తే నోర్చు నోపృథునితంబ!
అలకామధేనువు నస్మదాజ్ఞాబద్ధ
మై నిన్ను దేగల దంబుజాస్య
చింతామణీరత్న మెంతడాగిననైన
ని న్గనుఁగో నేర్చు నీలనుకచ

గీ. ఎటకు వోయిన రప్పింతు నెట్టులైన
నీదుపొందును గాంచెద నిన్ను నియత
మదనకేళిఁ గరంచెద మాఱుకొనఁగ
వలదు వల దింక మగువ నే వదల నిన్ను.

ఇంకను బయలున జూపట్టదే.

అహల్యః—(స్వ) తమాలమా. ఆశ్రితను రక్షింపుము.

ఇంద్రుః—(జనాంతికముగ) ఇట్లగుఁగాక గౌతమునికంఠము ననుక రించెదను. (ప్రకాశముగ) ప్రేయసీ! ఇట్లు పరుగిడి వచ్చి యేల

డాగితివి. పోదము రమ్ము.

అహల్య:—ఆశ్చర్యముతో (స్వ) ఆర్యపుత్రుఁడే కడసమయమునకు సరిగ నేతెంచెను. (ప్ర) ఇంతవిలంబ మేల చేసితిరి?

ఇంద్రుఁడు:—(గౌతమునిధ్వనితో) బ్రాహ్మముహూర్తక్రియలు ముగియవలదా?

అహల్య:—[స్వ] వారే [ముందునకు వెలువడి] ప్రియా!

ఇంద్రు:—[అడ్డపడి స్వస్వరముతో] ప్రియా! ఎట కేగితివి?

అహల్య:—అయ్యో! దైవమా! (మరల పరుగిడును.)

ఇంద్రు:—లలనా పోకుము. పోకుము. (తఱుమును)

అహల్య:—ఆర్యపుత్ర! మహర్షులారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు. (ముందునకుఁ బోవుచునే)

ఇంద్రు:—ఇదిగో చిక్కితివి (వేగముగ నహల్యను పట్టుకొనును.) ఆహా! ఎంతసంతోషము.

అహ:—(చే విదిర్చి ముందునకు దూఁకును.)

ఇంద్రు:—అయ్యో! భూలోకమునకుఁ బతిత వగు చుంటివి...... అంధకార మెంత చేసినది—

అహ:—ఎట్లు పతిత నైనను స్వైరిణిని గాకపోయినఁ జాలును (గట్టిగ) ఆర్యపుత్రా వందనములు. వాయుసంచాలనవశంబున తను వవశ మగు చున్నది. (తపోలోకమునుండియధోముఖంబుగ నదృశ్య యగును.)

ఇంద్రు:—చేయి జాఱినది. ఎట్టిప్రమాదమై పోయినది. సురధుని బిలిచెదను గాక

(తెరపడును.)



శ్రీ

# అహల్యాసహస్రాక్షము.

## షష్ఠమాంకము.

[స్థలము: తపోలోకము, నదీతీరము.]

గౌత:—(స్వ) ఉపస్నమయసంజాతంబు లగు తెలిజగ్గుల నొలసిమలసి, చీకటులమొత్తంబు లుత్తమునిసాహచర్యమున నించుక గళంకలు బింక, బింకంబు వాయుమిష్ఠుని తెఱంగున బలుచఁబడి యున్నవి! అహో! ధ్వాంతాచ్ఛాదితంబు లై యరవిరిదమ్ముల నెమ్మొ నందుకంకణంబులు మెఱయుచున్నవి. వాయుప్రేరితంబు లై, రింఖత్తురంగంబులన్ బోలె, తరంగంబులు పైకెగయ, చేతుల నెత్తి పిలుచుదానివలె, నదీలలామంబు సొంపు సంపాదించుచున్నది—(నది కభిముఖుం డై)

సీ. ప్రచలన్మరుత్ప్రతిప్లవమానశీకర

ముల జీవితాస్థైర్యమున్ వచింతు

వివిధరూపగ్రహణవిధానమును నేక

మగుభంగములవిష్ణుమహిమ వినుతు,

సద్యస్సముద్భూత చారుబుద్బుదముల

శ్రీచంచలతను ఘోషించుచుందు

ఘోరనక్రాసికకోలాహలమ్ము దు

ర్భరసంసృతిపథం బుపన్యసింతు

గీ. విట్టి నినుఁ గాంచి యెన్నియో నీతులీల

తెఱుఁగుకొనుచుంటి నీకి మీఁద నెఱుఁగుపాడ

తా వొసంగఁగ దే నదీతరుణి! నీదు

నలిన శోభితగృహముల! స్నానమునకు:

(అవగాహనము నభినయించి) ఇఁకను శుక్రోదయము గాలేదే. మొదట జపాదికంబులఁ గావింతు (జపనిష్ఠ సూచించి తడసి) ఏమి యింత ఇంతప్రొద్దైనను బ్రొద్దురాక దెలుపునరుణుండు చనుదేరఁడు (ఆలోచించి కో ళ్ళూరక గూసినవా. పోనీ నక్షత్రములతావులఁ బరిశీలించి యెన్నిఘడియల కుష స్సుదయించునదియుఁ గనియెద గాక (ఆకాశము లక్షించి) గృహమునుండి వెలువడునప్పుడే నే నేల వినువీధిని జూడ నైతిని. సప్తర్షిమండల మీఁపొంత నున్నది. ధృవ తారక మీఁకెలన మెలఁగు చున్నది. తెల్లవారుట కింకను రెండు ఝాములు పట్టును. ఎంతఛాందసుఁడ నైతిని. ఆత్రగానికి బుద్ధి మ ట్టనుట. నవోఢ యగుప్రియాంగన నొంటిమై డిగ్గవిడిచి కోడి కూఁత నమ్మిభ్రమించిననాయెడ సార్థక్యము గాంచినది. నాప్రియ సఖ తనసఖులను వీడి యుండునది కాదు. నర్మద నైన బిలిచి రా నైతిని. (వెను దిరిగి) యేమియోవామపార్శ్వ మదరు చున్నది. ఏమికీడు మూఁడునో కదా. కలకంఠీ నీవు సురక్షితవు కావా? (శీఘ్రగమన మభినయించి) కాంతారక్షణనిబిడం బగుగృహస్థ ధర్మంబు నెఱవేర్ప కడింది బెంగయయ్యెకిని. ఏమిది? ఏవరో పరు గిడుచప్పు డగుచున్న దేఁ విని ఎవరో సంభాషించు చుండిరి.

(నేపథ్యమున; ఆర్యపుత్రా! మహర్షులారా రక్షింపుఁడు, రక్షింపుఁడు, అనుధ్వని.)

అహల్యా ర్తనాద మున్నట్టు లున్నది. అప్పుడే యేమిపుట్టి మునిఁగినది. నేను మందభాగ్యుఁడనుసుమా!

(నేపథ్యమున: ఆర్యపుత్రా వందనము)

ఆయ్యో నే నను కొనినట్లనైపోయినది. కాలు జాఱి యహ ల్య తపోలోకమునుండి పడిపోవు చున్నది. ఈ ప్రాంతమునఁ బడిన భువస్స్వర్మహాజనలోకములు పార్శ్వముల నుండుటచే స్ఫూటిగా

భూమినే పడును. మధ్యమజగంబున నీవేళకు సూర్యుఁ డుదయించి యుండును. కాని ఈకాంత పడుసరి కెవరు కాచియుండి యెత్తె దరు. మఱెవ్వరో యిక్కడ మలగు చున్నారే. అడిగెదను గాక ఎవ రక్కడ (ముందునకు నడచును.)

ఇంద్రు—(నిశ్చేతన్కుఁడై పడిపోవుచున్నయహల్యను గాంచుచుండ

గౌత:—ఎవ రక్కడ.

ఇంద్రు:—(ఊరకుండును)

గౌత:—ఎవ రక్కడ.

ఇంద్రు:—(తలయెత్తి) నన్ను బిలుచువా రెవరు.

గౌత—నేను గౌతముఁడను.

ఇంద్రు:—నేను ఇంద్రుఁడను బ్రణమిల్లు చుంటిని.

గౌత: ఈనిశీధసమయమున నిచ్చటకు రా గత మేమి?

ఇంద్రు:—రావణసేన లెచ్చ టెచ్చట నుండునదియుఁ బరిశీలింప జనుదెంచుచు నిట నిల్చితిని (స్వ) ఇతనికి నే నే మని దెల్పె దను. ఊ! (జనాంతికముగా) మానసమా ఎంతకలవరబడు చుంటివి. నాదురుద్దేశమును దుష్కార్యమును దుష్ఫలము నెట్లని యితని కభివర్ణింతును. ఎంతపనిమాఁద మెంతపనిమాఁడము. హా హామా అవ్వల కేగి పొమ్ము. నీహాలాహలము నాని మత్తిల్లి స్త్రీ వధ యనుమహాపాతకంబున కొడిగట్టుకొంటిని. ఛీ, యీబ్రతుకుగడు నింద్యము (ప్ర) మహాత్మా యెంతపని జరిగిపోయినది.

గౌత:—సంచితకర్మఫలంబు ననుభవించి తీరవలయును కాని; ఏ మేమి జరిగినది!

ఇంద్రు:—(స్వ) ఏమిదెల్పుదును సురధుఁ డింకను రా లేదే. నే నిచట విశ్రమించి యుండు మని చెప్పఁగా, చెప్పకయే నాకము న కరిగి మరల లేదా. (యోజించి) ఇట్లుండు గాక (ప్ర)

చూచుచుండఁగనే యీకై వెదకుచు వచ్చు చుండినయహల్యా
శాలుజారి పడిపోయినది (వెనుకకు జరుగును. వెంటనే యొకకం
దకములోనికి పడును) అయ్యో దుర్గంధసంవృతం బగుదీనిలో
పడు చుంటిని. (ఆక్రోశించును.)

గౌత:—ఇది మహర్షులు మూత్రపురీషముల విసర్జించుదుర్గంధకూప
ము. నవ్వులాటాలకు వారు, పరకాంతాబలాత్కృతి గాంచువా
రిందు పడుదు రనుచుండిరి. నీ వట్టిదుష్కృతి నొనర్ప లేదుకదా?
నిన్ను వెలికి దీయువా రెవరు? అల్లదే ఎవరో వచ్చుచుండిరి.

మాతలి—(ప్రవేశించి) అహల్యాబలత్కారమునకై యిటు వచ్చి
దేవతలచే రాక్షసుల కులికి పారిపోయితి వని నిందితుఁడ వగు
చుంటివి ప్రభూ. సురధుర్యుండై నను నాతో గలియకపోయె. అప్పుడే
వారించి యుంటిని (అటునిటుచూచి) ఏమి మాటలాడఁడే? గౌ
తమా? ఇంద్రుఁడెటకరిగె.

ఇంద్రు—అయ్యో అయ్యో (అఱచును)

గౌత—(విస్మయముతో) అంతయుఁ దెలిసినది ఈపాపి మలకూపము
న బడి క్రిమికీటకంబులచే వేయితూట్లు పొడిపించుకొనుచున్నాఁడు
తగినప్రాయశ్చిత్త మైనది, పరస్త్రీపాపంబున నదియు మ్రగ్గి పో
యినది. ఇరువురకు శిక్ష యైనది. కర్మపద్ధతి విచిత్రము.

ఇంద్రు—దేవా క్షమింపుము. పాపిని మదాంధుఁడను.

మాత—కాదనినవా రెవరు కాని.

గౌత—నేను నెడలెదను. విమానమున బోయి భూలోకమున నాళ్ల
న్వికి మరణసంస్కారముల నాచరించి నిశ్చింతుఁడ వయ్యెదను.
(నిష్క్రమించును)

ఇంద్రు—మాతలీ మొదట నన్నుద్ధరింపుము.

మాత—నీపాపము నొప్పుకొని యమృతము దలంపుము

ఇంద్రు—అట్లనే(కొంతతడసి) ఏదీ నీనడుము దట్టీ నిట్లు విసరి పట్టు
కొనుము శరీర మంతయు నంగజగ్రహాకారంబు లగు తోరపుం
డ్లచే నిండినది. నన్ను లేవదీయుము.

మాత—అందుకొనుము. (దట్టివిసరి) పైకి లేవదీసితిని

ఇంద్రు—ఇదె నిర్గమించితిని నీసహాయమున నెట్లు దీర్చెదను. మూ
ర్ఛలేని దేవత్వముచే మఱింత దేహము శ్రమము నొందుచున్నది

మాత—అల్లవిమానారూఢుఁ డవు కమ్ము. రక్కసాలమూఁకలు వి
జృంభించుచున్నవి. పోవుదము. అమృతపుబూఁత యాపుండ్లను
మేలు జేయును.

ఇంద్రు—అవి మానునవి కావు. నా యీపరకాంతాపకృతియను క
ళంకము నివి శాశ్వతముగ నిల్పునేమొ!

మాత—చెరపకురా చెడుదు వను మాట యిప్పుడైన దెలిసినదా
హిహ్హిహ్హి! నీకు సిగ్గులేదు.

ఇంద్రు—ఎందులకూరక నొప్పించెదవు. నా యుల్లమే నన్ను వేధించు
చున్నది. దయచేసి నన్నెత్తుకొని పొమ్ము (చతికిలబడును) తగిన
నిష్కృతి లభించినది.

మాత—(దేవేంద్రు నెత్తుకొనును)

ఇంద్రు—ఎంతయవివేకినైతిని అహరావతీ! (కన్నులకు నీరునించును)

మాతలి—పతీ! చింతింపకుము. భగవంతుఁడు కరుణాసముద్రుఁడు.

గీ. న్యాయపథమున దప్పఁగొల్పి యనవరతము
సుజనరక్షయు నప్పుడే కుజనశిక్ష
గల్పనము సేయుచుండె ననల్పభువన
నర్తనవిలాసహితనైపుణంబు మెఱయ.

ఇంద్రు—పరమేశ్వరా! శరణు శరణు.

మాతలి—అదే మందారుఁడరుదెంచె (మందారుఁడు ప్రవేశించును)

ఏమివార్తఁదెచ్చితివి.

మందా—(స్వ) చెడ్డవార్తకొనివచ్చువారిని నక్షే మార్చెదు.

గీ. ధగధగాయితదీప్తుల దనరుమణియు
ఫణిఫణాగ్రింబుపై నుక్కి జనుల కెల్ల
సుగ్రిహాణమున జొప్పడ కుగ్రమగుచు
దూరనిక్షిప్త సుజనసంచార మగును.

(ప్ర) అయ్యా! మేఘనాధుం డంబికాపూజాదీక్షుఁడై యుండి యిప్పుడే యింద్రునిఁ బట్టెదననుచుండె. సైనికులెల్లఱు నిరుత్సాహులై యుదయమగుటకు ముంద తలదాచుకొందమని పలాయితులైరి.

పైనుండి:—(తంబుర మీటినచప్పుడు)

మాతలి:—నారదుఁ డేదో యాలపించుచుండె (వినును)

పైనుండి:—

చ. కట! విధి మంధరాకృతిని, కానల కంపుము రామునంచును
త్కటమగు దుష్టతత్త్వమున కారణ మొప్పఁగఁ జెప్పె: నామెయున్
దృటియును నిల్వకే విభుని దీర్పుము వాంఛ యటంచుఁబల్కె సం
కటములు సజ్జనావలికిఁ గాదె తటస్థము లౌట భూమిలో.

ఇంద్రి:—హాయి! హాయి! శ్రీరాముని కెట్టి దుర్దశఘటిల్లెను?

మాతలి:—దుర్దశయా?.ఆలోచింపుము! అదియే రావణవధకుత్రోవ.

ఇంద్రి:—(యోజించి) అట్లనా? ఏమియుం దెలియకున్నది? అతి మోహ మెంతజేసెను?

మందా:—విమానము నారోహింపుఁడు ప్రొద్దయ్యెను.

పైనుండి:—

క. జయ మాగావృత సీతా
నయనచకోరేందునకును, నరవరమణికిన్
జయ మా నహల్యఁ బ్రోచిన
నయనిధికిన్ స్తుత్యగుణగణద్యుతిధరికిన్.

ఇంద్రు:—నా పాపము శమించునా? అహల్యా! తప్పొనరించితిని.

రక్షిత వైదేహి:—అయ్యో! రావణుచే నోటువడి నా కతఁ దెలిసినరామున కేమని మోర జూపుదును?

మాతలి:—లెమ్మి!

(అందఱు విమానరూఢులై పోవుదురు.)



శ్రీ

# అహల్యానవహస్త్రకము.

## సప్తమాంకము.

(స్థలము: భూలోకము: దండకారణ్యము.)

సీతారామ లక్ష్మణులు ప్రవేశింతురు.

రాము—తపస్వీ! కంటకవిషమశిలా దుర్గమం బగునీదండకాటవిని జరింప నతిమృదులంబులు సహజారుణకాంతిమంతములు నగునీ చరణతలంబులు పిగిలిపోయి బీటలువారు చున్నవి. మిథిలానగరం బున కరుగు మనియు గౌసల్యా సేవజేయు మనియు నియోగింప నామాట విననొల్లవైతివి.

సీత—దారిపొడుగునను యీపల్కు లేనా.?

రాము—ఐన నన్ను మిన్నకయుండు మని యాజ్ఞాపించెదవా!

సీత—మిమ్ము నాజ్ఞాపింప నే నెంతటిదానను?

రాము—ఛల దనినవచ్చి నామాట జవదాటినంతదానవు.

సీత—ఆర్యపుత్రా! సతులు పతులతో నున్కియు నొక దోసంగేనా?

రాము—కాషాయవస్త్రములు ధరించి నిస్సంగినైన నాతోడనా?

లక్ష్మ—ఇది యంతయు యోజించియేగదా నేను కైకేయిమాటలు లెక్కపెట్టకు మంటిని.

రాము—వత్సా! ఇప్పు డేమిజరిగినదిలెమ్ము.

లక్ష్మ—ఏమి యందువా?

సీ. హేలావయోరమ్యు లిరుచక్కి చామర
వితతిఁ జేతులఁ బూని వీచుచుండ

ఎదురఁ గల్పితగీత మింపుమై బాడుచు
వందిగాయకరాజి పరిఢవిల్ల
కెలకుల సత్కథావలి తుంబురుల మేళ
గించి కవీంద్రులు గెరలు చూడ
అనతిదూరమున రాజ్యప్రకృతులు మంత
నములపాలనవిధానములు దెలియ.

గీ. పత్నితో నయోధ్యాపురీ ధర్మపీఠ
నుపవసించెదు నీ విట్టు లుదయ ముదయ
మును వనంబుల జరియింపఁ గనఁగ వలసె
నాకు దౌర్భాగ్యుఁ డగునట్టి నాకు నన్న.

సీత—సత్యస్థాపనమునకై రాజ్యభోగములు దృణీకరింప దగియున్న
వి. రాజు గానినాడు పౌరుషవంతుఁ డగుయోగి గావలయును.

రాము—సతీ! బాగుగా వచించితివి. లక్ష్మణా!

గీ. పైడిజిగు లీనెడు కషాయవస్త్రములను
చారుసితసికతాంతసంచారములును
గల్గి యోగిపథంబున గ్రాలు చుంటి
ఇన్ని నీసహాయంబున నే రహించు

సీత—లోకచక్షుఁ డగు సూర్యభగవానుఁ డదే తొలిగట్టుపై బొడ
గట్టుచుండె.

లక్ష్మ—అతని యరుణకిరణంబులు, శేళ్ళఁ జించి చెండాడు పులుల
క్రొన్నెత్తురుతో నిండిన వేడిగోళ్ళ వాడిమిఁజూపుచు, తపస్సం
తతులఁ బొలియించుచున్నవి.

రాము—రక్షో వీరగర్వనిర్వాపణనిపుణంబగు నీబుద్ధి సరిగనే ద్యో
తించినది.

సీ. వనతేనెగోలుచు వలువారుతేంట్లన
    ల్లనినీడ లందందు బొనుగువఱచి
చలువ తెమ్మెరలకుఁ జలియించు దీవల
    పై నీటిబొట్లఁ బ్రిభ బ్రచించి
ఆమనితేనికి హారతు ల్వెట్టు జి
    వుళ్ళకుఁ గెంజిగిపాం దొనర్చి
పీ్రితిగీతములాడు బికసుకంబులకు స
    గౌరవసంచార గరిమఁగూర్చి
గీ. భృత్యులనుసజ్జనులనుఁ బ్రకృతుల గవుల
రక్షణంబును జేసెడు రాజువోలె
తనదు కిరణంబులనుఁ బంచి తరణి జగము
వేడివెల్గును నిండించి విక్రమించె.

సీత—సకలప్రపంచస్థితి హేతువై, త్రిమూర్తిరూపివై, వేదత్రయంబునకు ధామంబవై, పద్మినీమనఃప్రమోదకరుండవై, సహస్రముఖంబుల సహస్రఖద్యోతంబులఁ బ్రిసారించి ధర్మపరిరక్షణసేయు నీకు భాస్కరా! నమస్కారములు.

రాము & లక్ష్మ—నమస్కారంబులు.

లక్ష్మ—అన్నా! నాకొకసంశయము.

రాము—ఏమని?

లక్ష్మ—వాసంతశోభచే దనరారు నీర్రొమామ్రావుల పై నీసుగంధవాసితసుమచయంబుపై, నీరంగురంగుల పిట్టల పై వ్యాపించు నర్కకాంతి మలపురీషంబుల పైన గూడ గన్పట్టుచున్నది.

రాము—సర్వసముం డగు రవి, దైవతేజముసుమా.

లక్ష్మ—జ్ఞానముఁ బ్రసాదించుట భగవానునికార్యము. దాని నుపయోగించుకొనుట మానవునియధీనము.

రాము—ఔను! ఈయనుపమాన వనలక్ష్మి సౌందర్యంబు సూర్య కాంతిచే గదామనకు సువ్యక్తమగు చున్నది.

సీత—

సీ. ఒకవంక పెనువంకలకలంకముగ నింకి
ధవళసైకతతాళతరులఁ జూప
వనిరోయుబలచాయలన మేయముగ మేయు
శాద్వలాంతశ్చరజ్జంతు లలర
ఒరుచక్కిపులుమెక్కి తరులెక్కి మఱిసొక్కి
వెలితెక్కలనుపక్కిపిండు విప్ప
ఘనగానమును వీనులను నీను విరిలోన
మధువాను తేంట్లసంభ్రమము లొలయ
గీ. ప్రకృతిలావణ్యమయి మోహపరత నుండె
బహుళముదమున మంటిమిగహన సీమ.
యోగులనుజీవనంబులే యోజనైన
నతిసుఖావహమంటినేనరయఁగంటి.

లక్ష్మ—ముందున్నది ముసళ్ళపండుగ యన్నట్లు కాళ్ళు జోములు పట్టి, యంతఃపురము వెలువడని నీకు నంతయు నూత్నంబుగా నత్యంతరమణీయంబుగా గన్పట్టు. తల్లీ ఇఁకముందింకనుఁ గఠిన ములైన ప్రయాణంబులువోవలసియుండును. ఘోరగిరిగహ్వరం బులవసింపవలసియుండును.

సీత—ఆర్యపుత్రుని సాన్నిధ్య మెట్టిచోటునవైనఁ గష్టమనసీయదు

రాము—(దూరముపలక్షించి) ఆవచ్చునదెవరు? జ్ఞాపకమున్నదా?

లక్ష్మ:—

సీ. తెలవన్నెలలవెన్నెలలచెన్ను నొగిదన్న
మెఱుఁగు దేజేకు గెంపుమునితోడ

తోఁగజోడుజగిబాడ బిగివీడనగఁగాదు
దయుదళుకొత్తు నేత్రములతోడ
అళివారములబారునలువారఁ గనిగేరు
కరిమబ్బులీనుముంగురులతోడ
రాయంచనడ తెంచురవమెంచ దగిబెంచు
శ్రవణపర్వదమగుస్వరముతోడ

రాము:—

గీ. మెల్లగా వోవుదము జేరనల్లి! వచ్చె

లక్ష్మ:—

స్వర్గమును వీడిమధ్యమజగతికేగు
దేవగురుఁడన నొక మహీదేవుఁడిపుడు.

(దూరమునుండి "సీతారామలక్ష్మణులకు సుస్వాగతము" అనుధ్వని)

లక్ష్మ:—అతఁడె పోగౌతముఁడు—

రాము—మనకతఁడు హితుఁడు.

సీతా:—ఎందులకు ?

లక్ష్మ—మున్ను విశ్వామిత్రుని యాగంబుఁగాచి, మిథిలకు, శివ ధనుర్భంగంబుఁ గావించి రానరుగునెడ, దపోలోకంబునుండి పడిన పతివ్రతామతల్లిని, అహల్యనుద్ధరించి అన్న యామెకు శిశిరోపచారంబులునల్పి, మరల ప్రాణమొసంగి గౌతమున కానందంబుఁ గల్గఁజేసె.

సీత:—కనుకనే, మనలదనభూలోకాశ్రమంబునకు నాహ్వానించు చుండె. అహల్య బ్రహ్మపుత్రికయట కాదా ?

రాము:—ఔను.

లక్ష్మ:—అంతియగాదు. అమెకై యింద్రుఁడు సహస్రాక్షుఁడయ్యె.

సీత:—మంచిదే కదా

లక్ష్మ:—ఓ! మంచిదే (నవ్వును) అమ్మా! కోపగింపకుము. నీ యార్యపుత్రునే యడిగికొనుము. అదియగాధపుగాధ.

సీత:—(రాముని జూచును)

రాము:—తన్వంగీ! ఒకప్పుడు బురుహూతుండు విరించిభు వనంబున నహల్యఁగాంచి మోహించె. గాని యంతలో రావణుఁడమ రావతిపై దండెత్తగా నాకపతి నిజపురి కరిగె. కతిపయ దినంబులకు పరస్పరము తొలినుండియుఁ బ్రేమించుచుండిన గౌతముండు నహల్యయు వివాహితులైరి. వారుఁదపోలోకంబుఁ జొచ్చిన కొంతవడికి, వారి వార్త విన్నశునాశీరుండు నిశాసమయంబని యుద్ధమైన విడిచి కోడికూత నెపంబునగౌతముని నది కేగ వంచించి, యొంటిమై నున్న యహల్యనుబలాత్కరింప నుద్యుక్తుండై నఁగినిసి యామె పరుగిడి, మానరక్షణకై ప్రాణంబుల సరకు సేయక తల్లోకంబు చివరనుండి యధోముఖంబుగఁ బడిపోయెను. అప్పటికి, తెలిసి, మరలిన గౌతముఁడు, మతిచెడినశక్రుండు చీకటిఁ గన్నుగానక, తొందరపాటున మలకూపమునఁబడి, క్రిమిదష్టుడై, మేనెల్ల వేయిపుండ్లు గల్గించుకొని మూల్గుచుండఁ గాంచి వానికైన నిష్కృతికిగతం బెఱింగి, విమానారూఢుఁడై విద్యుద్వేగమున నహల్యపై నంటియే, మరుద్యంత్రశక్తిచే నామె పతివేగముగబో నీకయెడనెడనాపె. కాని సమ్మూర్ఛనందిన యామె శిలాకృతినిర్జీవయై, యొకకటికబండపై వేగముగ బడునంతలో నేనుగని, యెగిరిపట్టి, వసిష్ఠోక్తంబులగు నాయుశ్శాస్త్రమోఘ క్రియలచే నామె నుజ్జీవితనుజేసితి. అంతలో గౌతముండు నరుదెంచె.

లక్ష్మ:—అందునఁ గదా ఱాతిని నాతిగ నొనర్చె నని, యహల్యోద్ధారకుం డని రాముఁడు పేర్కొనఁబడుట.

సీత:—అహో! ఎంత దుష్టుఁడింద్రుఁడు ?

లక్ష్మ:—వాని పిండము బిల్లకాకులు దిననిమ్ము! వానికి వచ్చిన గతి దేవునికెఱుక. పాపిని దుష్కర్మయే కినిసి చంపును. వాఁడు దేహమెల్ల తూట్లువడి వికృతాకృతియైనదే గాక బలము లేమి యుద్ధమున రావణుచేనే మయ్యెనో.—ఎట్లైన సహస్రాక్షుబిరుద ము లభించినది.

సీత:—బాగున్నది. గౌతముఁ డిదే వచ్చెను.

గౌత:—(ప్రవేశించి) సీతారామలక్ష్మణులకు సుస్వాగతము నేఁడు నాయాశ్రమమును మెట్టి నన్ను దరింపఁజేయుఁడు.

రాము:—ఎల్లరును సుఖులు లే?

గౌత:—మీకృపాతిశయంబున నందఱు సుఖులే? ఏమి యీ సృష్టికర్మ నటనా ప్రకారము? ఎక్కడెక్కడ నిన్ను దర్శింపవలసె.

రాము:—మాతల్లి యహల్య యారోగ్యముగ నున్నది గదా?

గౌత—ఉన్నది. మాగృహమున వసింపరండని మిమ్ము వేడికొని రానన్నుఁబుత్తెంచినది.

లక్ష్మ—నాకమున కరిగిఖ్యుంటిరా?

రాము:—ప్రసాదము! మీయింట నాతిథ్యమువల దందునా?

గౌత:—ఇద్దెదోవ (శ్రోవఁజూపుచు) లక్ష్మణా! నాకవిషయముడిగి తివా? ఇంద్రుని గుఱించియా?

లక్ష్మ:—(సాభిప్రాయధ్వనితో) ఔను.

గౌత:—ఇంద్రుఁడు మేఘనాథునిచే నోటువడి, పరాభవానంతరము విడువఁబడి, నిర్భాగ్యుఁడై, రావణుని కనుసన్న మెలంగుచు, లజ్జాశోకపరాభవభావదందహ్యమానుఁడగుచుండ, బ్రహ్మ యతనిని విడిపించు నప్పు డహల్యావృత్తాంతము దెలిసి లేచి పోవుచుండ, నతని కాలుపట్టుకొని త్రింశత్కోటి దేవతావమతు

మునఁ శత్రువీరసాహస్రసాన్నిధ్యమున, తానపరాభవము నర్పను ద్యమించెననియు, నామెకళంకితగా లేదనియు, నిష్కృతి యైన దనియు నుడివితెమింపుమని—

(ముందున కందఱు నడచుచుందురు.)

లక్ష్మ:...ఏడ్చెను గదా!

గౌత:—ఔను, అహల్యావిషయమునఁ బంచభూతములామెను 'బరిశుద్ధ' యని ఘోషించినవి.

రాము:—ఇంద్రుఁడును చనుదెంచుచున్నట్లున్నదే.

గౌత:—(నింగిఁజూచి) విధాతయుఁ జనుదెంచుచుండె.

లక్ష్మ:—మనము నాశ్రమోపాంతముఁ జేరితిమి.

సీత:—అహల్య పుష్పాపచయము చేయుచున్నది.

అహ:—(అభిముఖురాలై) సీతారాములకు మంగళము! లక్ష్మణునకు స్వాగతము. (సీతకై గోని) అమ్మా! మనము వరవాటికకేగుదమురమ్మా. తండ్రీ! రామచంద్రా! అర్ఘ్యము గొందువురమ్ము (సీతతో ముందుపోవును)

ఇంద్రుః—(విమానముడిగ్గి) గౌతములకు నమస్కారములు. శ్రీరామునకభివాదములు. (ముందునకేతెంచి) తల్లీ! ఆహల్యా! ఈ నిర్భాగ్యుఁడింకను ఖలచిత్తుఁడని యెదలంచి వెడలిపోవుచుంటివా? (స్వ) ఈ తేజోవతియె నా సీతామహాదేవి! ఈమెయే మాదుగఖములపోగొట్టుటకు మూలకారణంబగు ననికదా, సలువ యోజనతిచ్చె?

అహ:—(వెను దిరిగి చూచి) వత్సా లేదు లేదు. అందఱును సరోవరస విధపుష్పకుటీరమునకు విచ్చేయుఁడు! (ఆశ్రమముఁజొచ్చును)

బ్రహ్మ:—(ప్రవేశించి) మంచి సమయమున కరుదెంచితిని.

అందఱు:—ధాతా! సమస్కారశతంబులు.

బ్రహ్మ:—శుభప్రాప్తిరస్తు!

లక్ష్మ:—ఇంద్రా! కుశలివే? ఏలయిట్లువచ్చితివి?

రాము:—శచీపతీ! సుఖివిగదా?

ఇంద్రు—సుఖమా! ఏమనిసుడువుదును? రావణునకు సాధంతుడనై యష్టకష్టము లనుభవించుచు విముక్తికై నీసహాయ్యము నపేక్షించి యిదె శరణుజొచ్చితిని (సాగిలిపడును)

రాము—(లేవనెత్తి) భీతిల్లకుము.

బ్రహ్మ—ప్రజాసమూహమును వేధించుచున్న దుండగీఁడైన రావణుని వధింప నీవే జన్మించితివి.

రాము—మహానీయా! నరుండగు నేను?

బ్రహ్మ—అట్లనకు. నరావతారుఁడగు వికుంఠుఁడవీవు! హనుమదాదుల సఖ్యంబున మున్ముందు, లంకఁజొచ్చి సమిత్రబాంధవ పరివారంబుగా రావణుఁ బరిమార్చి, విజయుఁవై, సీతాదేవిఁగూడి సామ్రాజ్యపట్టభద్రుఁడవగుదువు.

ఇంద్రు—కాన నే నీ చేనభయంబు గొనవచ్చితిని.

రాము—అభయమిచ్చితినిగాని, విద్వేషబీజము స్ఫుటముకాలేదు, ప్రజాదుఃఖము ముఖ్యకారణము.

బ్రహ్మ—వియోగము రెండవకారణము?

రాము—సీతావియోగమా? నాకట్లుండ ఈవిషయము దేవిని దుఃఖముచే వగల్చువైచునే కానిండు.

బ్రహ్మ—రామా! వహింపుము. ధర్మస్థాపనార్థము, దుష్టహననార్థము క్షత్రియుఁడు సర్వములు నోర్వవలయు.

రాము—స్వచిత్తమా శాంతింపుము.

అహల్య—(హర్షముతోఁబ్రవేశించును.)

బ్రహ్మ—

సీ. చిఱుతప్రాయమునాఁడ, సింహవిక్రముఁడవై
తాటకఁ ద్రుంచితుద్దండలీల
ధర్మపోషణమున దవిలివిశ్వామిత్రు
యాగరక్షణఁ జేసితతులశ్రద్ధ
శివధనుర్భంగంబుఁ జేసందినంతన
గల్పించిగార్హస్థ్యగరిమగంటి
వనివాలిదశకంధరాదులఁ బొలియించి
సురసార్వభౌమునిసరణిద్రొక్కి
గీ. దలయయోధ్యకు నేగి నీవలఘుమహిమ
రాజ్యమునుఁ బొందికీర్తినిఁ గ్రాలఁగలవు
సమరభీమ! మేరుస్థేమ! సకలదనుజ
ఖలవిరామ! ప్రజానిత్యకామ! రామ!

పంచభూతములు—(నేపథ్యమున) తథాస్తు!

బ్రహ్మ—రామా! అహల్యయిచ్చు హారతినిస్వీకరించి కొన్నిదినంబు
లిట విశ్రమింపుము.

అహల్య—(గేయము)

మంగళము ధర్మమండితకీర్తికి
మంగళము సర్వమాన్యసుభాషికి
మంగళము రాజ్యమాహితవర్తికి
మంగళము దేవమానవపోషికి

గౌత—ఈపుష్పకుటీరములోనికి విచ్చేయుఁడు.

రామ—మహాత్మా! విరించీ! మీనిర్దేశముల వినవలతును.

బ్రహ్మ—జామదగ్న్యుఁడుముందేయానతిచ్చియుండె. విన నిట్లగుఁగాక.

సీ. సురలెల్లఁగుమిగూడి పెరిమెమైనిచ్చుట
వర్తింతుగా కరిభంజనమున

సీ. వివిధధాతు విచిత్రనవరుచిర శైలాగ్ర
 విబుధుల దనియించు వెండికొండ
భక్తదుఃఖాకర భక్తంకరవచోవి
 నాశంబుగా జుంకె నందివైన
కొల్చువారలుగోరు కోరిక లీడేర్చు
 మత్తినీడగ శివమ్మూర్తి గొలుప
నారదాదిమహర్షి నాయకుల్జుట్టు గం
 గాతుషారార్ద్రేందు కళల మునుఁగ
గీ. యోగనిష్ఠాగరిష్ఠత నొడలుమఱచి
ఫాలశిఖశిఖాభీకరాంబకము మోడ్చి
శాంత భీభత్సకరుణారసంబు లొకట
జూపు నీకు వినమ్రత సూపువాఁడ.
సీ. ఉస్స్వరంచాస్య సముదితమహా నిశ్వాస
 మేనిగమాకృతి మేకొనంగ
నిజకంఠనినదంబు భజనసేయు సరస్వ
 తీ వీణలో శ్రుతుల్ దేల్చుచుండ
వారు సనకసనందనాదిమునీంద్రు
 లుపనిషదర్థంబు లొనరుపంగ
జీవరాసుల కర్మచేష్టాపరిజ్ఞాన
 మెంచి కేల్దమ్మి శాసించుచుండ
గీ. సృష్టినిర్నిద్ర తావృత్తి సాగియువేల్పు!
భారతీగీతసువ్యక్త వైభవుండ!
నాల్గుమోములఁ గృపఁజెల్లు నలినగర్భ!
నీకివియె నమోవాకముల్ నియతిసేతు!

